# విజయపతాకము

## ప్రథమాంకము

### ఒకటవ రంగము

నర్తనశాల: వివిధ వాద్యవిశేషములతో మహోజ్వలముగా నలంకరింపఁబడి యుండును. ఒకవంక నున్నతాసనము లమర్పఁబడి యుండును. ఒక యాసనముపై బృహన్నలయు, నాతని కెదురుగా నింకొకయాసనముపై నుత్తరయు, గూర్చుండి యుందురు. బృహన్నలలో నానందము బికి వచ్చుచుండును. కాని, యాత దద్దానిని బహుకష్టముగా నిగ్రహించుకొనుచుండును. ముఖభంగిమలలో విచారము వ్యక్తము సేయ యత్నించుచుండును. కాని, యాతని మనోరథము సిద్ధించుట కంతరాయములు గల్గుచుండును. అప్రయత్నముగ నాతని పెదవులపై నప్పుడప్పుడు దరస్మితము తొంగిచూచుచునే యుండును. ఉత్తర మోము వివర్ణమై యుండును; సంభ్రమాశ్చర్య విషాదము లామెహృదయము నెంతగాఁ గలఁచుచున్నవో, యామె ముఖ వైవర్ణ్యమునుబట్టియే తెలియనగును. ఇరువురును నిమేషమాత్రము మౌనముగా నుందురు.

బృహ : (మృదులముగ) రాజకుమారీ !

ఉత్తర : (తృళ్ళిపడి) ఏమి ఆచార్యా !

బృహ: నిత్య ప్రఫుల్లమగు నీమో మీనాడు వెలవెలపోవు చున్నది; విషాదచ్ఛాయలు స్ఫుటముగ గానవచ్చు చున్నవి. కారణము?

ఉత్త: అన్నియుఁ దెలిసిన మీరే యిట్లడిగిన నే నేమని చెప్పగలను. మాకిప్పుడు విషాదము గాక యింకే మున్నది? మా రాజ్యమునకు పెట్టనికోట సింహ బలుఁడు. సార్థక నామధేయుఁడగు నాతఁడు గంధర్వు లచే హతుఁడైనాఁడు.

బృహ: (తీవ్రముగ) కామాంధుఁడు; తన పాపమునకు తగిన ఫల మనుభవించెను.

ఉత్త: (బృహన్నల కంఠధ్వనికి బెదరి) గురుదేవా!

బృహ: (అంతలో సర్దుకొని ప్రసన్నముగ) ఏమి రాకుమారీ!

ఉత్త: మీ కంఠధ్వని

బృహ: (నవ్వుచు) ఓ! అదా! ప్రజలాడుకొను మాటలను అనుకరింప యత్నించితిని.

ఉత్త: అంతేకద! మీరు నిజముగా కోపించితిరేమో అను కొంటిని.

బృహ: అబ్బే! నాకేల కోపము? కాని సైరంధ్రిని, ఆ సాధ్వీతిలకమును, నిండుసభ యెదుట, మహారాజు చూచుచుండగా, – (తీవ్రముగ) తలపట్టి యీడ్చుట; అబ్బా! ఆ కామాంధుఁడు, ఆ మదోన్మత్తుఁడు –

తన దుశ్చేష్టలకు తగిన ఫలమునే అనుభవించినాడు. (ప్రసన్నతకు యత్నించి విఫలుఁడగును).

ఉత్త: ఇప్పుడు మీకోపమనుకరణముకాదు; నిజమే. ఆ మహాసాధ్విని పరాభవించుట - బలాత్కరించుట - ఛీ - రోతపుట్టుచున్నది

బృహ: (ప్రసన్నుఁడై) తన దుష్కర్మకు తగిన ఫలమతఁడనుభవించెను కాని, అతని చావువలన మీరాజ్యము బలహీనమైనది. అది సత్యము.

ఉత్త: అది ముమ్మాటికి సత్యము. కాకున్న, సింహబలుని వజ్ర ముష్టిఘాతములను చవిచూచిన సుశర్మ, యుద్ధ రంగమునఁ గాండీవుఁడై పలాయన మంత్రమును పఠించిన సుశర్మ, మత్స్యదేశముపై మరల దాడి సేయునా? తెరచినిల్లు కుక్క చొచ్చినదఁట.

బృహ: కుమారీ! నీమాట నిజము. ఆ నీచుఁ డీపాటికి నిర్జితుఁడై నిర్లజ్జముగ మీ తండ్రిగారి పాదములపై, బడి క్షమాభిక్ష నర్థించుచుండును. అదిగో! నా మనో నేత్రమునకు స్పష్టముగ గోచరించుచున్నది. మత్స్యదేశాధినాథులు విజయలక్ష్మి సనాథులు.

ఉత్త: (సంతోషముతో) అది సంభవమా గురుదేవా! త్రిగర్తేశుని మానాయనగారు జయింపగలరా! రారాజు సైన్యమునగల మహావీరులలో అతఁ డొకఁడఁట.

బృహ : (తీవ్రముగ) రా — రా — జు (అక్షరములు నొక్కి పలుకును)

ఉత్త : (భయచకితయై) గురుదేవా !

బృహ : (సర్దుకొని) ఔనౌను — రారాజు — ఆ దుర్యోధనుఁడు (వెడనవ్వు నవ్వును)

ఉత్త : ఏల నవ్వుచున్నారు ?

బృహ : నవ్వక — ఏడ్వమందువా ?

ఉత్త : (మోము ముడుచుకొని) ఏడ్వనేల ? నవ్వుచునే యుండుడు. ఒకరి కష్టముల కింకొకరు విచారింపనేల?

బృహ : కుమారీ ! నేనొక్కమాట చెప్పెదను వినుము. మీ కిప్పుడు వచ్చిన నష్టమేదియును లేదు. లేని కష్టమునకు నీవు విచారించుట అనావశ్యకము.

ఉత్త : మా నాన్నగారు — — — (అర్ధోక్తి)

బృహ : ఆయనకేమి ? ఈపాటికి విజయలక్ష్మీసనాథులై మహోల్లాసముగ నుండి యుందురు.

ఉత్త : అది సంభవమా !

బృహ : ఏల కాదు ?

ఉత్త : సింహబలుఁ డిప్పుడు లేడుకదా !

బృహ : కీచకుఁడు చనిపోయినంత మాత్రమున ప్రపంచమే గొడ్డువోయినదా !

ఉత్త: మా నాయనగారు వీరులే కాని వయోవృద్ధులు ; మా సైన్యముకూడ నంతంతమాత్రమే. సుశర్మకు సుయోధనుని యండ గలదు. ఆతని సైన్య మపారమని విందుము.

బృహ: కుమారీ! నీ వన్నది సత్యమే. సుశర్మకు సుయోధనుని యండదండ లున్నవి. కాని, యిప్పుడు మాత్రము మీ సైన్యమును, ఆ సుశర్మయే కాదు — చతురంగబల సమన్వితుఁడై, ఆ సుయోధనుఁడే వచ్చినను, జయింపఁ జాలఁడు.

ఉత్త: పరిహాసమా!

బృహ: నీతోనాకు పరిహాసమా కుమారీ! ఇది కేవల సత్యము.

ఉత్త: అదెట్లు ?

బృహ: నీ వెప్పుడైన మల్లయుద్ధములు చూచితివా ?

ఉత్త: చూడకేమి ? మా నాయనగారికి మల్లయుద్ధమన్న బహు ప్రీతి, మొన్ననేకదా మహా భయంకరుఁడగు మల్లు డొకడు వలలుని చేతిలో హతుఁడైనాఁడు! అబ్బ! ఆ దృశ్యము .... ....

బృహ: దృశ్యముమాట అటుండనిమ్ము. వలలుఁడు వీరుఁడని యంగీకరింతువా ?

ఉత్త: వీరుఁడేకాదు. మహా వీరుఁడు, ఆ వీరవరుఁడు సింహశార్దూల మద కరీంద్రములతో పోరునప్పుడు మీరు చూచితిరో లేదో కాని — — —

బృహ : (నవ్వుచు) చూడకేమి పెక్కుసారులు చూచితిని, కాని యీ పోరు విలాసమాత్రమే

ఉత్త : (ఆశ్చర్యముతో) విలాసమా !

బృహ : అవును, అవి ఖురళీకలహములు. ఉబుసుపోకకై యాతఁడు చేయు వినోదములు. నిజముగ నాతఁడు కోపించి విజృంభించినచో, ఆ ప్రచండతేజుని యెదుట దేవ దానవులుకూడ నిలువలేరు

ఉత్త : ఆతఁడంతటి బలశాలియా !

బృహ : (నిర్వికారముగ) నాగాయుత బలుఁడు.

ఉత్త : (సంతసముతో) ఆ పరాక్రమనిధి సాహాయ్యమే మనకు లభించినచో మనకు జయము తథ్యము.

బృహ : ఆ వీరచూడామణి సాహాయ్యము మీకు లభించినది. ఆతఁడు మీనాయనగారికి బాసటయై నిలిచియున్నాఁడు.

వలలుఁ డొక్కఁడె చాలు దుర్వారవైరి
బలము లుక్కడగింప దోర్విలసనమున;
ప్రళయకాలోగ్ర శిఖిశిఖాభయదమైన
యతని తేజమ్ము దుర్నిరీక్ష్యమ్ము సుమ్ము.

ఆతఁడొక్కఁడే కాదు, తంత్రీపాలుఁడు, దామగ్రంధి, కంకుభట్టు, కూడ యుద్ధరంగమున కేగిరి.

ఉత్త : వారికిగూడ యుద్ధము సేయు నేర్పు కలదా ?

బృహ : బాగున్నది నీ ప్రశ్న ! వారు మహావీరులు. శస్త్రాస్త్ర కళానిపుణులు.

ధీరుండెవ్వఁడు సంగరోర్విఁ గల తంత్రీపాలు
నోర్వంగ? సం
హారప్రోద్ధత వీరవిక్రముని దామగ్రంధి నీక్షించినన్
బోరన్నిల్వఁగ నెవ్వఁడోపు? రిపురాట్పుంజంబు
శస్త్రాస్త్రముల్
జారన్వీడదె కంకుభట్టు సమరోత్సాహంబుఁ
జూపింపఁగన్.

రాజకుమారీ ! విష్ణుదేవుని చతుర్భుజములట్లు, ఈ సర్వ సర్వంసహాచక్రమునే సంరక్షింపఁగల సమర్థులు వారు. అందును కంకుభట్టారకులు మహా పురుషులు. వారున్నచోట జయము తథ్యము.

ఉత్త : నిజమే. వారు మహాపురుషులనుటకు సందియము లేదు. వారిని గాంచినంతనే నా హృదయము భక్తి పరవశమగును.

బృహ : మంచిది పూజ్యులయెడ భక్తికలిగియుండుట శ్రేయో దాయకము.

ఉత్త : మీ మాటలవలన నాకు కొంత మనశ్శాంతి చేకూరి నది కాని (చిరునవ్వుతో) నాపిచ్చియూహలకేమిలెండు.

బృహ : అట్లనరాదు, ఒకప్పుడవియే నిజము కావచ్చును.

ఉత్త : ఇప్పుడు నగరరక్షణమున కెవ్వరును లేరుకదా! ఒకవేళ, కురురాజే దండెత్తి వచ్చినచో మనము చేయు నదేమి ?

బృహ : (పరాకుగ) ఆఁ రానిమ్ము. ఇచ్చటనే ఆ దుర్మతిక శృంగభంగమగును. (చేతులప్పళింపఁ బోయి మరల నవ్వి) యువరాజు మహావీరుఁడు.

ఉత్త : (చిరునవ్వుతో) కురురాజని యనినంతనే భుజము లప్పళించి, సమరోత్సాహమును బ్రదర్శించితిరే. నాట్యము మాని మీరుకూడ యుద్ధము సేయుదురా ?

బృహ : ఆఁ చేయకేమి ? (సాభిప్రాయముగ) యుద్ధము చేసినచో కురురాజుతోడనే చేయవలెను. సమరమున నోర్చిన నిందు్రనే యోర్వవలెను. అధిష్ఠించినచో మహేంద్రుని చింతామణీపీఠమునే యధిష్ఠింపవలెను.

ఉత్త : (ఆసనమునుండిలేచి నృత్యభంగిమతో) ఓహో హో! మెచ్చదగియున్నది. గెలిచిన కాలకేయనివాత కవచులనే గెల్వవలెను. మెప్పించిన నెక్కటి కయ్యమున త్రిశూలినే మెప్పింపవలెను. (బృహన్నల దగ్గరగా వచ్చి) గురువుగారూ! జగదేక ధనుర్ధరులు, ఆ మహావీరులు మా మేనమామలే యని మీకుతెలియునా?

బృహ : (తలయూచి) ఏ మహావీరులు ?

ఉత్త : ఈ కాలమున మహేంద్రు నోర్చిన మహావీరులెంద రున్నారు ? ఒక్కరే.

బృహ : ఎవరో ఆ మహానుభావులు

ఉత్త : పాండవ మధ్యములు. గాండీవధనుర్ధరులు.

బృహ : ఓ — తెలిసినది. తెలిసినది. అర్జునుఁడా !

ఉత్త : ఔను వారే. మాకు తెలియదనుకొంటిరేమో ! వారి వీర విక్రమమునే మీరు వల్లెవేయుచున్నారు. ఆ మహా మహు లాచరించిన ఘనకార్యములను జేయగలవారీ త్రిలోకములలో నెవ్వరును లేరు. మీరు నాట్యభంగిమ లలో వానిని జూపవచ్చును, నేను చూచి యానందిం దింతును. మా యన్నకు వారనిన నెనలేని గౌరవము.

బృహ : (చిరునవ్వు నవ్వుచు) అటులనా ! అది సరియేకాని, నీవన్నటుల కురురాజే యుద్ధమునకు వచ్చినచో మన మేమి చేయుదము ?

ఉత్త : (గంభీరత నటించుచు) నాట్యము చేయుదము.

బృహ : (చిరునవ్వుతో) ఆ చిలిపితనమే వలదంటిని.

ఉత్త : మరేమి చెప్పుమందురు. ఇచ్చట నున్నానన్నమాటే కాని నా మనస్సంతయు యుద్ధభూమి కడనేయున్నది. నాన్నగారెట్టి యిక్కట్టులపాలగు చున్నారో. (కంట తడి పెట్టును).

బృహ : అదే కూడదు. కంటతడి పెట్టనేల ? మనకు విజయము తథ్యము.

ఉత్త : గురుదేవా ! మరల మరల నడుగుచున్నందులకు నన్ను క్షమింపుడు. ఏదో చెప్పలేని భయము నన్ను పీడించుచున్నది. కావున అడిగినదే మరల అడుగుచున్నాను. నన్నూరడించుటకే మీరీ మాట లనుచున్నారు. అంతేకాని మీకు మాత్రము తెలియదా ? మా నాన్నగారు నిజముగా సుశర్మ నోడింపగలరా ?

బృహ : కలరా ? ఇంకను సందేహమా ? మనకు విజయము తథ్యము తథ్యము తథ్యము : నరా.

ఉత్త : అమ్మయ్య నాగుండెబరువు తీరినది.

బృహ : మరి రెండవది.

ఉత్త : ఏ రెండది.

బృహ : సుయోధనుని మాట.

ఉత్త : వాని మాటయేమి ? ( క్షణమాత్ర మూరకుండి ) అమ్మయ్యో ! కురుబలమే దండెత్తి వచ్చినచో – భీష్మ ద్రోణాది మహావీరు లందుందురు – వారి నోర్వగల మగటిమి యెవ్వరికున్నది ?

బృహ : అంగరాజును మరచితివి ; సహజ కవచకుండల మండితుఁడు.

ఉత్త : (విచారముతో) సుయోధనుఁ డాతనిని జగదేక వీరుఁ డగు అర్జునునకే ప్రతి ద్వంది గా తలంచునఁట. ఆతని నోర్వ నా ధనంజయుఁడే రావలయును.

బృహ : (చిరునవ్వుతో) వచ్చునేమో.

ఉత్త : (చిరుకోపముతో) గురుదేవా! మీరు పూజ్యులు. కాని పరిహాసమున కిది సమయము కాదని తెలిసి కొనుట మంచిది.

బృహ : ఇందు పరిహాస మేమున్నది? ఇప్పు డిచ్చటికి కురుబలము దండెత్తివచ్చినదా యేమి? అది కేవలము నీ ఊహయేకదా! ఇది నా ఊహ.

ఉత్త : (నవ్వుచు) బాగున్నది మీ తర్కము, కాని నగర రక్షణమున అప్రమత్తులై యుండుడని మా అన్న గారిని హెచ్చరింపవలసి యున్నది. ఎప్పటికేది వచ్చునో.

బృహ : (వ్రేళులు లెక్కించుకొనుచు పరధ్యానముగ) ఒకటి, రెండు, అధికము.... పదమూడు—

ఉత్త : గురుదేవా

బృహ : (నవ్వుచు) ఏమి?

ఉత్త : ఏదో లెక్కించుచున్నారు.

బృహ : ఆఁ ఏమియునులేదు, నేనిక్కడికివచ్చి యెన్నినెల లైనదో అని — —.

ఉత్త: పదమూడు నెలలైనదా.

బృహ: కాలేదు. నిన్నటితో పండ్రెండు నెలలు ముగిసినవి.

ఉత్త: నెలలు లెక్కించుచున్నారు. మమ్ము విడచిపెట్టి యెచ్చటికైన (అర్ధోక్తి)

బృహ: అబ్బే! అదేమియును గాదు. ఊరక —

ఉత్త: ఊరక గాదు. నాకాపాటి తెలియదనుకొంటిరా? ఇంతవరకు గ్రహింపకుండుట నాదే పొరపాటు. ఈతి బాధలు గల రాజ్యమున నెవ్వరుందరు?

బృహ: కుమారీ! నీ హృదయము భయభ్రాంతమై యున్నది; కావుననే లేనిపోని యూహాపోహలకు గురియగు చున్నది.

కాని కుమారీ! నాదొక్క ప్రశ్న గలదు.

ఉత్త: అడుగుఁడు, నాకు తెలిసినది చెప్పెదను.

బృహ: నీవు చిన్నదానవు, ఆటపాటలతో గడుపవలసిన యీడు నీది, నీఆలోచనలు నీయీడునకు తగినవికావు.

ఉత్త: (నవ్వుచు) ఇది ప్రశ్నకాదు. ఇది మీ అభిప్రాయము

బృహ: (నవ్వుచు) మాటలు నేర్చితివే —

ఉత్త: (చిరునవ్వుతో) మాటలకేమి? క్రియాశూరత్వము లేనప్పుడు మిగిలినది వాక్శూరత్వమే (ఇరువురు నవ్వు దురు) మీరడుగ దలచినది నాకు తెలియును. నా ప్రకృతియే యట్టిది. నేను క్షాత్రమును ప్రేమింతును.

ధర్మమును ప్రేమింతును శూరత్వమును భూషింతును, భీరుత్వమును గర్హింతును.

(ఉత్తరకుమారుడు ప్రవేశించును)

ఉత్త: అన్నగారు (పాదాభివందనము చేయును)

ఉ. కు: శీఘ్రమేవ కళ్యాణ ప్రాప్తిరస్తు. (బృహన్నలవంక జూచి) ఏమి! ఆచార్యా! మా సోదరి నాట్యమును శ్రద్ధగ అభ్యసించుచున్నదా

బృహ: శ్రద్ధాభక్తులలో మీ సోదరిని చెప్పి మరొకరిని చెప్పవలెను యువరాజా! నాట్యమున ఆమె నైపుణ్యమనుపమానము.

ఉ. కు: భళిభళీ! అట్లాన మట్లుండవలెను. మేము ధనుర్విద్య నభ్యసించునపుడు, మూడు మాసములకే గురువును మువ్వతిప్పలు పెట్టితిమి (వెడనవ్వు నవ్వును).

బృహ: అనఁగా, గురుధిక్కారము (అర్థోక్తి)

ఉ. కు: ధిక్కారమా! అంతకంటె మంచిపనియే చేసితిమి.

బృహ: అదెట్లు?

ఉ. కు: గురువుగారు వృద్ధులైరనియు, వార్ధకమున వారికి విశ్రాంతి నొసంగుట మంచిదనియు నాయనగారికి చెప్పితిమి. వారందుల కంగీకరించిరి. గురువుగారు నిర్విచారముగ ప్రశాంతముగ శేష జీవితమును గడుపుటకై వారికొక యగ్రహారము నిచ్చిరి. మా బుద్ధి

విశేషమునకు గురువుగారు సంతసించి మమ్మాశీర్వదించిరి. వారి శిష్య వాత్సల్యమును మేము సభాముఖమున నుగ్గడించితిమి. ఎట్లున్నది మా బుద్ధినైపుణ్యము.

బృహ : ప్రశస్తముగ నున్నది.

ఉ. కు : భళిభళి ! ఇప్పటికి మాబుద్ధిచాతుర్యమును గ్రహింపగల్గితివి. ఇంక మా ధనుర్విద్యా సామర్థ్యమును గూడ నీవు తెలిసికొనవలసి యున్నది. కాని, ఆచార్యా !

బృహ : ఏమి యువరాజా !

ఉ. కు : కన్యకలకు నాట్యము నేర్పుచు నెన్నినాళ్ళు గడపుదువు. బ్రతికిన వీరోచితముగ బ్రతుక వలయును. మాకడ ధనుర్విద్య నభ్యసింపుము. ఊరక విద్యనేర్చుకొనరాదను నియమము నీ కున్నచో, మాకు గూడ నీవు నాట్యము నేర్పుము. నీకు విలువిద్య మేము నేర్పుదుము. ఎట్లున్నది మాయూహ.

బృహ : దివ్యముగ నున్నది. కాని యింత త్వరలోనే నాకు విశ్రాంతి తీసికొను తలంపు లేదు.

(ఉత్తర నవ్వును)

ఉ. కు : భళిభళి ! నీ తెలివి మెచ్చదగినది. (అని నలువంకలఁ జూచును)

బృహ : ఏమట్లు చూచుచున్నారు ?

ఉ. కు : ఉష్ ! మాటాడకుము. ఇందెవ్వరైన శత్రువులు

దాగి యుండవచ్చును. (నలువంకలఁ దిరుగుచుండును. బృహన్నల ప్రశ్నార్థకముగ నుత్తరవంకఁ జూచును. ఉత్తర నిట్టూర్చి నొసలు చిట్లించును).

బృహ : రాకుమారా ! ఇక్కడ శత్రువు లెట్లుందురు ?

ఉ. కు : (దగ్గరకువచ్చి) ఎట్లుండురా ? దాగి యుందురు. సమయము దొరకినపుడు మీాసపడి చంపుదురు.

ఉత్త : సింహబలుని చంపినట్లు

బృహ : ఓహో !

ఉ. కు : మరేమనుకొంటివి ? అందులకే ఈ నాట్యశాలపై మొదట నాదృష్టి పడినది.

బృహ : ఎవ్వరైన దాగియున్నారా ? అనగా దాగియున్నట్లను మానించుట కవకాశమున్నదా ?

ఉ. కు : అనుమానమునకేమి? కాని, పట్టపగలు దీనిని వెదకి లాభములేదు. రాత్రి రావలెను.

బృహ ; ఔను రాత్రి వచ్చుటయే మంచిది. చీకటిలో శత్రువును ముట్టడించి, చంపవచ్చును.

ఉ. కు : వలదు; వలదు; చీకటిలో వలదు. చీకటి కావుననే సింహబలుడు గంధర్వుల గుర్తింపలేక మరణించెను.

బృహ : కాగడాలతో వచ్చినచో, ఆ వెలుతురు దూరము నుండియే గుర్తించి, శత్రువు పారిపోవునేమో !

ఉ. కు : ఔనును, అది నిజమే, శత్రువు పారిపోవచ్చును. ఇఁక వానిని పట్టుకొనుటెట్లు ?

బృహ : పట్టుకొనుటెట్లు? (నిమీలిత నేత్రుఁడై క్షణముండి, కన్నులు తెరచి) ఇదియొక విషమసమస్యగాఁ దోచు చున్నది. దీనినిగూర్చి సావధానముగా యోచించిన కాని సమాధానము రాదు.

ఉ. కు : నిజమే. దీనినిగూర్చి సావధానముగా యోచింప వలసి యున్నది. మేము మా యేకాంత మందిరమున కేగి, ప్రశాంతముగ దీనిని విచారింతము.

(నిష్క్రమించును)

ఉత్త : నిట్టూర్చి ! గురుదేవా ! ఇది మీకు తగునా.

బృహ : నేనేమి చేసితిని.

ఉత్త : మా అన్నగారి యజ్ఞత నాధారముగాఁ గొని మీరు మమ్మెగతాళి చేయుటలేదా ?

బృహ : ఎంతమాట ! మిమ్ము హేళన చేయుదునా ? తిన్న యింటి వాసములే లెక్కపెట్టు నంతటి నీచుడనా ?

ఉత్త : అంతమాట లెందుకు లెండు. మా అన్నగారు మీ కొక వినోదవస్తువుగా దోచియుందురు. వారితోఁ గొంత వినోద కాలక్షేపము గావించిరి.

బృహ : ఎంతమాట, యువరాజులతో నాకు వినోదమా.

ఉత్త : (తీవ్రముగ) కాక, ఇంతదనుక మీరుచేసిన ఘనకార్య మేమి ? క్షమింపుడు ఆవేశములో ఏదో అంటిని.

బృహ : కుమారీ ! నీ కిప్పుడు కొన్ని విషయములు చెప్పఁ దలచితిని. సావధానముగ వినుము. రాకుమారుఁడు

మూర్ఖుఁడు గాడు. అట్లని సంపూర్ణ విచక్షణత గలవాడును కాడు. అన్యోన్య విరుద్ధములగు భావము లాతని స్వభావమున చాలకలవు. ఆభిజాత్యమునకు తగిన యాత్మనిగ్రహము గాని, సంపత్సమృద్ధి కుచితమగు సంస్కారముగాని, ఆతనిలో లేవు. కాని ఆతఁడు వక్రబుద్ధి కాఁడు. వంచకుడును గాఁడు. ధర్మరక్షణమునందాతనికాసక్తిగలదు. కాని, దాని నాచరణలో పెట్టు శక్తిలేదు. ఆతని కనుమానము మెండు. కాని దానిని నివారించుకొను నుపాయ మాతనికి తెలియదు. తెలిసినను ధైర్యసాహసములతో ముందు కురుకలేడు. ఉరికినను లక్ష్యసిద్ధి యగువరకు నిలువజాలడు. కీచకుని గంధర్వులే చంపిరని యందరును నమ్ముచున్నారుకదా !

ఉత్త : కాకున్న నంతటి బలశాలి నెవ్వరు చంపగలరు ?

బృహ : అది నీ విశ్వాసము, కాని మీ యన్నగారి యభిప్రాయము వేరు.

ఉత్త : అదెట్లు ?

బృహ : ఎవ్వడో మానవుఁడే అతని సంహరించి యుండునని యాతని దృఢవిశ్వాసము. అందులకే నర్తనశాలను పరీక్షించి చూడవచ్చెను. ఇందేకదా సింహబలుడు మడిసెను.

ఉత్త : ఒకవేళ మానవుఁడే యైనను, ఇంతదనుక వాడిట విడిది చేయునా ?

బృహ ; విడిది చేసియుండునని యువరాజు నభిప్రాయమును గాదు.

ఉత్త : మరి ?

బృహ ; ఆతని యునికిని సూచించు వస్తువెద్దియైన దొరకు నేమో యని యువరాజు నాశ.

ఉత్త : అందులకా యీ మధ్య, ఇచ్చటికి తరచుగా మాయన్న గారు వచ్చుచున్నారు.

బృహ : మరేమనుకొంటివి ?

ఉత్త : నా నాట్య మెంతవరకు వచ్చినదో దెలిసికొనుట కను కొంటిని.

బృహ : మును పెన్నడైన నిటు వచ్చెనా ?

ఉత్త : నర్తనశాల యెందున్నదోకూడ వారికి తెలిసియుండదు.

బృహ ; మరేమి ? అంతయు స్పష్టమే. అంతేకాదు, నగర రక్షణవ్యాజమున, పౌరుల యిండ్లన్నియుఁ బరిశోధింప రాజభటుల నంపియున్నాఁడు.

ఉత్త : బాగున్నవి తెలివితేటలు. దీనినే 'అతితెలివి' యందురు.

బృహ : ఊహ మంచిదే. దాని నాచరణలో పెట్టు విధానము మాత్రమిది కాదు, అంతే.

ఉత్త : ఏమో ! అశక్తి, దుర్జనత్వము,

బృహ : తప్పు, యువరాజెంతమాత్రమును దుర్జనుఁడుకాఁడు. కేవల మశక్తుఁడును కాఁడు. స్వశక్తిని, పరశక్తిని

తెలిసికొనలేని అమాయకుఁడు. ఆ అమాయకత్వము బహు ముఖముల నున్నది: వాచాలతను వాగ్మిత్వ మనుకొనుట; శూరత్వమును నిర్దయత్వ మనుకొనుట; భీరుత్వము నహింసా పరాయణత్వ మనుకొనుట — ఇట్టి భ్రాంతులనేకములు.

ఉత్త: ఈ భ్రాంతులకు విముక్తి లేనేలేదా ?

బృహ: ఉన్నది. దైవ మనుకూలించినచో సర్వమును సుసంపన్నము కాగలదు. ఇప్పటికే చాల ప్రొద్దెక్కినది. నీ వంతఃపురమున కేగుము. నేనును ఇంటికేగెదను.

(నిష్క్రమింతురు)

— తెర —

ప్రథమాంకము — రెండవ రంగము

[ఉత్తరకుమారుని మందిరము: స్త్రీ జన పరివేష్టితుఁడై ఉత్తరకుమారుఁడొక యాసనమున సుఖోప విష్టుఁడై యుండును. ఒకచో పుష్పమాలికలును, మంచిగంధము, అత్తరువు పన్నీరు మున్నగు సుగంధ ద్రవ్యము లుండును. ఇర్వురు జవ్వను లిరువంకల నిలిచి యువరాజునకు వీవనలు వీచుచుందురు. ఒక సుందరి పుష్పమాలికలను సర్దుచుండును. ఇంకొకతె సుగంధ ద్రవ్యములను పరిశీలించుచుండును. ఒక నర్తకి నాట్యభంగిమలో నిలిచియుండును ]

ఉ. కు: మాలతీ! ఆపు; ఈనాడు నాట్యము వలదు.

మాల: ఏమి యువరాజా! నాట్యం చూడరా? లేక చూడగా చూడగా మా నాట్యం విసుగుగా వుందా?

ఉ. కు: (గంభీరముగ) ఈ నాఁడు నాట్యము చూచుటకు మాకు తీరికలేదు.

మాల: ఈనాటి ప్రత్యేకత యేమో.

ఉ. కు: ఈపాటి తెలియదా

మరొకతె: నగర రక్షణభారమంతా యువరాజుపై పడింది కదే. అందుచేత తీరిక ఉండి వుండదు. మనస్సు రాజకీయాలాలో వేడెక్కిపోతూ వుంటే నాట్యం చూడ్డానికి తీరికెక్కడే

ఉ. కు: భళిభళి మల్లికా! నీ తెలివితేటలు మెచ్చదగినవి. ఇదిగో బహుమానము. (మెడలో ముత్యాలహారమును తీసి యిచ్చును.)

మల్లిక: (సంతోషముతో బహుమతి నందుకొని) ఏమే! అలా బొమ్మల్లాగు నిలబడతారేం. యువరాజుకు కర్పూర చందనం పూయండి; సురభిళ పుష్పమాలికలతో ఆ మహావీరుని కంఠాన్ని అలంకరించండి. (ఉత్తరకుమారుడు మహానంద పరవశుఁడై భుజము లెగురవేయును. ఒక జవ్వని హరి చందనమును,

ఇంకొకతె మల్లియల దండయు గొని వత్తురు. ఉత్త రుఁడు హరిచందనమును నంగుళితో గ్రహించి యాఘ్రా ణించును. మల్లెపూల దండనుగూడ వాసనచూచును).

ఉ. కు : అబ్బ! ఎంత సువాసన! (అంతలోనే గంభీర ముద్రను వహించి) రాజ్యము వీరభోజ్యము.

(పూలమాల పట్టుకొనిన స్త్రీ ఈ మార్పునకు కారణ మేమి? అనునట్లు రెండవ సుందరివంక చూచును. ఆమెయు తనకు తెలియదన్నట్లు హస్తనేత్ర సంజ్ఞలు చేయును. వారిర్వురు మల్లికవంకఁ జూతురు)

మల్లిక : అదేమి యువరాజా! ఆమాట కాదన్న దెవరు? అది జగద్విదితమగు సత్యము కదా

ఉ. కు : (గంభీరముగ) మేము మహావీరులము — అని నీవే అంటివి.

మల్లిక : (ఇంచుక తరవాలోచించి) బలే! బలే! ఇప్పుడు తెలిసింది. (చందన పుష్పమాలా ధారిణులవంకచూచి) ఏమే! మీకు మతుల్లేవూ? వీర శూర శిఖామణులు శ్రీ శ్రీ యువరాజ ఉత్తరకుమారులకు హరి చందనం పూస్తారా? మల్లెలదండ వేస్తారా? ఎంత అవమానం. నళినీ! నువ్వు రక్తచందనం తీసుకురా! చంద్రికా! నువ్వు మందారమాల పట్రా! ఊఁ, వేగం కదలండి మహా వీరులను శాంతింపఁ జేయండి.

ఉ. కు : ఆహా! బుద్ధి విశేషమనగా అట్లుండవలెను. ఇదుగో, బహుమతిని గ్రహించు. (మెడలోని పచ్చలపదక మిచ్చును.) (నళినీ చంద్రికలు, యువరాజునకు రక్త చందనము పూసి మందారమాల వేయుదురు.)

ఉ. కు : (మహోల్లాసముతో) మేము వీరులము.

నళినీ, చంద్రికలు : మేము శూరులము.

మాలతి : మేము వీరశూర శిఖామణులము.

మల్లి : ఇంక మనము జైత్రయాత్రకు బయలుదేర వచ్చును. (అందరు విరగబడి నవ్వుదురు) (ద్వారపాలకుడు ప్రవేశించి నమస్కరించును).

ద్వా. పా : జయము జయము యువరాజా! గోపాలకులు తమ దర్శనం కోరుతున్నారు.

ఉ. కు : గోపాలకులా! పసుల కాపరులకు మాతో నేమిపని?

ద్వా. పా : ఏమో యువరాజా! వాని ఒళ్ళల్లా రక్తమే కొన్ని చోట్ల గాయాల్నుండి ఇంకా రక్తం కారుతూనే వుంది.

ఉ. కు ; రక్తమా! ఏదో ఘోరమగు అపాయమే సంభవించి యుండును. వారిని త్వరగా ప్రవేశపెట్టుము.

మల్లిక : అందరిని తీసుకురాక, వారిలో ముఖ్యుణ్ణి, అంటే యువరాజులకు ఉన్న పరిస్థితి చక్కగా చెప్పగలవాణ్ణి ప్రవేశపెట్టు!

ద్వా. పా : చిత్తం. (నిష్క్రమించును)

(రక్తసిక్తగాత్రుఁడగు గోపాలుఁడు ప్రవేశించును ; విస్మయ విస్ఫారిత నయనుఁడై ఉత్తరుఁడు వానిని చూచుచు నట్లే నిలిచియుండును. కొంతసేపెవ్వరును మాటలాడరు.)

గోపా : నమస్కారములు యువరాజా !

ఉ. కు : (తుళ్ళిపడి) ఎవరది ?

మల్లిక : గోపాలుఁడేదో తమతో మనవి చేసుకొంటున్నాఁడు.

ఉ. కు : (కన్నులు నులుపుకొని చూచి వెకిలిగా నవ్వును) ఔనౌను. గోపాలుఁడు – (గంభీరము) గోపాలకా ! భయమువలదు. నీకు వచ్చిన ఆపద యేమి ? సురాసురు లడ్డువచ్చినను నిన్ను రక్షింతును. ఇదే మా శపథము. (ఒరనున్న కత్తిపై చేయివేయును)

గోపా : ఏమి చెప్పను యువరాజా ! అంతా పెద్ద పీడకల లాగుంది.

ఉ. కు : (తీవ్రముగ) కలయా ? కలకు భయపడి మాకు విన్నవింప వచ్చితిరా ? పిరికిపంద! నీకలలు వినుట తప్ప మాకు పనిలేదా ?

(గోపాలుడు గజగజ వణకును)

మల్లి : శాంతించండి యువరాజా ! వాడు చెప్పేది సావధానంగా వినండి.

ఉ. కు : వాని పీడకలనా ?

మల్లి : కలలాగుందన్నాఁడు, కలే అని చెప్పలేదు.

ఉ. కు : (గోపాలునితో) నీవు చెప్పునది యథార్థ విషయమే కద ? కల కాదుకద ?

గోపా : కలకాదు యువరాజా ! నిజంగా. ప్రమాణపూర్తిగా జరిగిందే. మేమందరం చావుదెబ్బలు తిన్నాం.

ఉ. కు : ఎవరు మిమ్ము కొట్టినది. త్వరగా చెప్పుము. తక్షణమే వానిని దండింతుము.

గోపా : కురుసేన యువరాజా ! కురుసేన.

ఉ. కు : ఆఁ ! కురుసేనయా ? అదెట్లు నీకు తెలిసినది. (మల్లివంకఁజూచి) వీని యభిప్రాయమున చావుదెబ్బలు కొట్టినవారందరు కురుసైనికులే. (వెకిలిగా నవ్వును)

మల్లి : యువరాజా ! ఇది తేలిక విషయంలా కనబడ లేదు. వీడు చెప్పేది జాగ్రత్తగా విని, ఒక నిశ్చయానికిరండి. మనం అప్రమత్తతతో వ్యవహరించవలసిన విషయం వచ్చినట్టుంది. (గోపాలునితో) చెప్పవయ్యా ! అది కురుబలమే అని మీకెలా తెలిసింది ?

గోపా : వారి భటులే చెప్పారమ్మా !

"ఇది కురుసార్వభౌముని ఆజ్ఞ. ఆలమందలను వదలి పొండి; లేకుంటే మీ ప్రాణాలు దక్కవు" అని వారి భటులు మమ్మల్ని బెదిరించేరు.

ఉ. కు : కేవలము కొందరు భటులేనా ? సైన్యముకూడ నున్నదా ?

గోపా : కొద్దిమంది భటులే అయితే మాకేం భయం యువ రాజా! వారితో ఒక పెద్ద మహాసైన్యంకూడా వుంది. ఒక పెద్ద సముద్రమంత సైన్యం. అవి యేనుగులు కావు: అవి గుఱ్ఱాలు కావు; పెద్ద కొండలంతేసి యేనుగులు.

ఉ. కు : (గంభీరముగ) రథములుకూడ నున్నవా ?

గోపా : వున్నాయి యువరాజా! పెద్ద రథాలు; వానిమీద పెద్ద జెండాలు.

ఉ. కు ; (నవ్వుచు మల్లికతో) ఆ సైన్యమును చూచినంతనే ఈ పిరికిపంద భయపడి యుండును.

గోపా : భయపడలేదు యువరాజా! మా శక్తికొద్దీ ఆ భటులతో యుద్ధం చేసేం, (విచారంగా) మాలో కొందరు చచ్చిపోయేరుకూడా! మా తలకు మించినపని అవి తెలియగానే, ప్రభువుల్తో మనవి చేసుకుందామని వచ్చేం. మందల్నిప్పుడే వాళ్ళు తోలుకుపోతున్నారు. యువరాజా!

ఉ. కు : భయము వలదు. కురుబలమే కాదు, ఆ దేవాసురులు వచ్చినను మీకు భయములేదు. మద్బాహుబల రక్షితులైన మీకు భయములేదు. ధనుర్మాత్ర సహాయుండనై వారిని చీల్చి చెండాడెదను.

మల్లి : యువరాజులు మీకు అభయం ఇస్తున్నారు. ఇంక భయ పడవలసిన పనిలేదు. వారి బలపరాక్రమాలు—

గోపా : యువరాజుల బలపరాక్రమాలు మాకు తెలియవా ? విల్లుపట్టి వారు విజృంభిస్తే, నిలబడగల వీరుఁడేడమ్మా నిండుసభలో మహారాజు లెన్నిసార్లు చెప్పలేదు, కిరీటికి సాటి యువరాజులే అని. అమ్మా ! నాకు తెలియ కడుగుతాను. ఆ కిరీటి అంత విలుకాడా ?

మల్లి : (నవ్వి) బాగున్నది నీప్రశ్న! ఆయన మహావీరులు, యుద్ధంలో దేవేంద్రుణ్ణే జయించిన మహారథులు.

గోపా : (కన్నులు చిట్లించి) మన యువరాజుల్ని కూడా మించుతాడా ?

మల్లి : (నవ్వి) నీప్రశ్నకు యువరాజులే సమాధానంచెప్పాలి.

ఉ. కు : ఆ జగదేకవీరుఁడు మా కాదర్శపురుషుఁడు. మా కారాధ్యుఁడు.

(గోపాలుఁడు నోరువిప్పి తెల్లబోయి చూచును)

మల్లి : (గోపాలునితో) అలా నోరువెళ్లబెట్టి తెల్లబోయి చూస్తావేం. మీరు ముందు వెళ్ళండి. యువరాజులు రథారూఢులై వస్తారు. మన రాజ్యపు పొలిమేర దాట కుండానే గోవులను మరలించవలసి వుంటుంది. (గోపాలుఁడు నిష్క్రమించును) (ససంభ్రమముగా ఉత్తర ప్రవేశించును)

ఉత్త : అన్నయ్యా ! త్వరపడు ; మన గోధనమును కురుబల మపహరించిన దఁట.

ఉ కు : నీకెవరు చెప్పిరమ్మా.

ఉత్త : సైరంధ్రి చెప్పినది. ఆమెకూడ నాతో వచ్చినది. ఆవల నాగిపోయినది. నీవు వెంటనే బయలుదేరి, కురుబలము నెదిరొ్కనవలెను.

ఉ. కు : చూచెదవుగాక మా ప్రతాపము. కురుబలమంతయు మమ్ము జూచి పారుఁదను భీతిని కలగుండు పడవలయును. మన్నిశిత బాణాహతికి కురువీరులందరును మూర్ఛపోవలయును. కాని-(కొంచెము సేపాలోచించి) ఒక్కటి సందేహము.

ఉత్త : సందేహములకేమి ? వానిగూర్చి తరువాత తీరుబడిగ ఆలోచింపవచ్చును. ముందు యుద్ధసన్నద్ధుఁడవుకమ్ము.

ఉ. కు : యుద్ధమునకు మేమెప్పుడును సంసిద్ధులమే. కాని సారథి యేడీ ? త్రిగర్తేశునితోడి యుద్ధమునకు, మహారాజుతోఁగూడ, మన సైన్యమంతయు నేగినది. సైన్యముతో సారథులుగూడ నేగిరి.

ఉత్త : ఒక్క సారథియు నూరలేడా ?

ఉ. కు : లేదు. మహారథికుఁడైనను సారథిలేకుండ యుద్ధము సేయుటెట్లు ?

ఉత్త : విషమసమస్య వచ్చినదే. ఇప్పుడేమి చేయుట ?

ఉ.కు : ఏమో ! అంతయు నస్తవ్యస్తముగా నున్నది.

(సైరంధ్రి ప్రవేశించును)

సైర : (ఉత్తరతో) రాకుమారీ! మీరిప్పుడు రథచోదకునకై వెదకుచున్నట్లున్నది.

ఉత్త : ఔను, సారథి యొక్కఁడుకూడ లేడు.

సైర : లేకేమమ్మా

ఉత్త : (ఆత్రముతో) ఉన్నాఁడా ? ఎవరు ? ఎక్కఁడ ? త్వరగాచెప్పు సైరంధ్రీ !

సైర : ఎక్కఁడనో కాదమ్మా ! ఇక్కఁడనే యున్నాఁడు. మీ నాట్యాచార్యులు లేరా ? వారే, రథచోదనమున వారివి మించినవారీ ప్రపంచమున నెవ్వరును లేరు.

ఉత్త : నాట్యాచారులా ? వారికి సారధ్యము తెలియునా ? ఎప్పుడు వినలేదే ?

సైర : దేనికైనను సమయము సందర్భము నుండవలెను కదా ! ఇంతదనుక అట్టి సందర్భమే రాలేదు. కావున వారా విషయమును ప్రస్తావించి యుండరు. నూత కృత్యమున వారిప్రజ్ఞ అనుపమానము.

ఉ.కు : (వెడనవ్వు నవ్వి) ఏమమ్మా ! సైరంధ్రి ! హాస్య మాడుటకు నీ కింతకంటె మంచి సమయము దొరక

లేదా ? ఆ పేడియేమి ? సారధ్యము సేయుటేమి ?
నీకేమైన మతి చలించినదా ?

ఉత్త : అన్నయ్యా! ఏమామాటలు? ఏపుట్టలో ఏపామున్నదో ఎవ్వరి కెరుక ? ఆచార్యులు నివురుగప్పిన నిప్పువంటి వారు. వారి కెన్నివిద్యలు తెలియునో ? మన మెప్పుడైన పరీక్షించితిమా. వారిలో నిగూఢముగ నొక తేజో విశేషమున్నది. అది నేను గమనించితిని.

ఉకు : ఏమి గమనించితివో ! పేడికి రధ సారథ్యమా ? అందును మహా భయంకరమగు రణరంగమున -

సైర : రాకుమారా ! కారణాంతరమున నిట్టి వికృతాకారము వచ్చినంత మాత్రమున, శౌర్య ధైర్యముల కెట్టి లోపమును గలుగదు. వారికి పేడితనము విధివశమున వచ్చినది కాని సహజము కాదు వారి శౌర్య ధైర్య పరాక్రమములు నే నెఱుగుదును. వారే సారధ్యము సేయుట కంగీకరించినచో, జయము తధ్యము.

ఉకు : ఆతని బల పరాక్రమములు నీకెట్లుతెలిసినవి. ఇంతకు ముందాతఁ డెవ్వరికైన సారధిగ నుండెనా ?

సైర : రాకుమారా ! సూతకృత్యమున వారికిగల సామర్థ్యమెన్న నేరి తరము ? ఖాండవదహన సమయమునఁ గిరీటికి సారథియై యాతనికి జయము సమకూర్చిన దెవ్వరు? బృహన్నలా సాహాయ్యములేనిచో పార్థుఁడు

మహేంద్రు నోర్చియుండునా ? పెక్కు మాటలేల ? బృహన్నలా సాహాయ్యమే లభించినచో మీకు పార్థ సాహాయ్యము లభించినట్లే. వారిర్వురకు భేదమేలేదు.

ఉ కు : (ఆశ్చర్యముతో) వారిర్వురు నంతటి సన్నిహితులా ? బృహన్నల పార్థునకే సారథ్యముచేసెనా? సైరంధ్రీ! వారిర్వురకు నింతటి సన్నిహితత్వము కలదని నీకెట్లు తెలిసినది ?

ఉ త్త : అదేమిటన్నయ్యా ఆ ప్రశ్న. మున్ను సైరంధ్రి పాండవ పట్టమహిషి ద్రౌపదీదేవి కడనేకదా యుండెడిది ! అట్టియెడ విజయునకు విరోధులెవరో, సన్నిహితు లెవరో ఆమెకు తెలియకుండునా ?

ఉ కు : ఔనౌను మరచితిని, ఆవిషయమే మరచితిని. సరే సవ్యసాచియే యాతని సాహాయ్య మపేక్షించినపుడు మేమేల యపేక్షింపరాదు, కాని—

ఉ త్త . మరల సందేహమా ?

ఉ కు : సందేహము కాదు. ఆనాట్యాచార్యుని సూతకృత్యమునకు సుముఖుని గావించుటెట్లు ? అని.

ఉ త్త : అది నాకు వదలివేయుము. వారి నంగీకరింపఁజేయు బాధ్యత నాది. విజయమునకు — అదిగో వారే వచ్చుచున్నారు.

(బృహన్నల ప్రవేశించును)

ఉ. కు: (మనోల్లాసముగ) జయము జయము (నాలుక కరచుకొని) ఆఁహ! మాకు —

బృహ: దిగ్విజయ మగుఁగాక! యువరాజా! శత్రువుల పట్టుకొను నుపాయమాలోచింతు మంటిరే, ఆలోచించితిరా?

ఉ. కు: ఓ! ఆలోచింపకేమి; ఆలోచించు చుండగనే వారు మన యాలమందల బలత్కారముగఁ దోలుకొని పోవుచున్నారు.

బృహ: బలత్కారముగనా? (మోము చిట్లించి) ఎవరువారు?

ఉ. కు: ఇంకెవరు? (వికటముగ) సుయోధన మహా రాజుగారు.

బృహ: (ఆశ్చర్యముతో) ఆఁ! సుయోధనుఁడా!

ఉ. కు: ఔను. సుయోధనుఁడే. అదిసరే ఆచార్యా! సూత కృత్యమున గూడ నీకు ప్రావీణ్యము గలదఁట. మాకెప్పుడును చెప్పలేదే.

బృహ: మీ కెవ్వరు చెప్పిరి?

ఉ. కు: ఎవ్వరు చెప్పిననేమి? (సైరంధ్రివంకఁ జూచుచు) అది సత్యమగునా? కాదా? నిజము చెప్పుము.

ఉత్త: ఇందు దాపరిక మేమున్నది? గురుదేవా! మాకు సైరంధ్రి చెప్పినది.

బృహ: (సైరంధ్రివంకఁ జూచుచు) ఓహో?

ఉత్త: ఏమి? నిజముకాదా?

బృహ : నిజముకాదని యెట్లందును ?

ఉత్త : అమ్మయ్య ! ఇప్పటికి పని సానుకూలమైనది.

బృహ : ఏమిపని ? ఎట్లు సానుకూలమైనది ?

సైర : కురుబలములు వచ్చి గోధనమును అపహరించుకొని పోవుచున్నవి. వారితో యుద్ధముచేసి, గోవుల మరలింపవలెనను ఉత్సాహము రాకుమారునకు గల్గినది. కాని, సమయమునకు సారధియే కరవైనాఁడు. రాకుమారున కెంతటి బలపరాక్రమము లున్నను, ఏమి ప్రయోజనము ? ఆ దుర్యోధనుని దురహంకారమును జూడుఁడు. ఒకవంక త్రిగర్తేశునిచే దాడి చేయించినాఁడా? సైన్యమంతయు నటు తరలి నంతనే. చతురంగ బలసమేతుఁడై తానే వచ్చి, పసులకాపరుల నదలించి యాలమందల నపహరించినాఁడా? ఎంతటి క్షుద్రరాజనీతి. (సైరంధ్రిమోము కోపమూర్తితమగును)

ఉ. కు : (భయముతో) స — స — సైరంధ్రీ !

ఉత్త : కురురాజు కుటిలనీతి జగత్ప్రసిద్ధమే. నాఁడు పాచికలాడి పాండవలక్ష్మి నపహరింపలేదా? నిండు సభలో నిరపరాధను, మహాపతివ్రతను, పాండవ ధర్మపత్నిని పరాభవింపలేదా? ఎన్ని దుష్కృత్యము లాచరించిన నేమి ? వానికే దైవసాహాయ్యము గూడ లభించుచున్నది. పాపము ! ఆ మహనీయులు పంచపాండవు లిప్పుడెక్కడ నున్నారో ! ఆ సాధ్వీతిలకము

ద్రౌపది యెక్కడ నున్నదో! ఎన్ని యిడుములు పడుచున్నదో!

సైర: రాజకుమారీ! విచారమున కిది సమయము కాదు. పాండవుల మాటకేమి? ఎవ్వరో మీవంటి ధర్మ పరులు వారికి సాహాయ్యము గావించియే యుందురు. (బృహన్నలతో) ఆచార్యవర్యా! మీ బలపరాక్రమములు, చూపదగు సమయము వచ్చినది. ఇంతదనుక మీరు ప్రచ్ఛన్నముగనే యుంటిరి. కవ్వడికి మీరు చేసిన సాహాయ్య మిట నెవ్వరికిని తెలియనే తెలియదు. నాకుఁ దెలిసియుఁ జెప్పలేదు. చెప్పదగు సందర్భమును రాలేదు. ఇప్పుడు వచ్చినది. మీరు మీ పూర్వనైపుణ్యమును బ్రదర్శించి, రాకుమారునకు జయము చేకూర్పుఁడు.

(బృహన్నల మౌనముగా నుండును)

ఉత్త: (బృహన్నలను సమీపించి) గురుదేవా! నా ముద్దు సెల్లింపరా? నా యభ్యర్థన నీ యొక్క దానిని మన్నింపరా?

బృహ: కుమారీ! నీ మాట నేనెప్పుడు కాదంటిని,

ఉత్త: అయిన మా అన్నయ్యకు సారథిగానుండ నంగీకరింపుఁడు.

బృహ: సరే.

ఉత్త : (సంతోషముతో) జయము మాదే; మాదే జయము— అన్నయ్యా ! గురుదేవా ! నాది యొక కోరికయున్నది.

బృహ : చెప్పుకుమారీ! సందియమేల? ఎంతటి యసాధ్యములను గూడ నిర్వహించి నీ కోర్కె నెరవేర్తును.

ఉత్త : కురువీరుల యుష్ణీషములను బొమ్మ పొత్తికలుగా నుపయోగింప వలెనని మా కన్నియల యభిలాష. విజయలక్ష్మి సమేతులై వచ్చునపుడు మీరు దానిని మరువకూడదు.

బృహ : కుమారీ ! నీ యభిలషితము తప్పక నెరవేరును. మహామాని యగు కురురాజు ధరించు ననర్ఘ శిరోవేష్టము నీ బొమ్మపొత్తికలకు దగినది.

ఉ. కు : మహారాజు సుశర్మ నోడించి వచ్చులోపల, ధనుర్మాత్ర సహాయులమై మేము, భీష్మ ద్రోణ కర్ణ కృపాశ్వత్థామాది మహావీర శోభితమగు కురుసైన్యము నశ్రమమున నోడించి, విజయలక్ష్మి సనాథులమై యాలమందల మరలించుకొని వత్తుము. — — ఎవరక్కడ ?

(సేవకుఁడు ప్రవేశించి నమస్కరించును)

సేవ : చిత్తము దేవా ! ఆజ్ఞ.

ఉ. కు: బృహన్నలకుఁ దగిన కవచమును. ఉష్ణీషమును దెమ్ము. అశ్వపాలకునితోఁ జెప్పి రథము సిద్ధము

సేయుము. ధనుస్తూణీర కవచాదుల ధరించి మేమిప్పుడే వత్తుము.

సేవ : చిత్తము. (నిష్క్రమించును)

సైర : (ఉత్తర చిబుకమును స్పృశించి) నీవు మా బంగారు తల్లివి.

.. తెర . .

# ద్వితీయాంకము

## ప్రథమరంగము

(ఉత్తరుఁడు పరుగిడుచుండగా బృహన్నల యాతని వెన్నంటి వచ్చుచుండును)

బృహ : రాకుమారా ! రాకుమారా ! ఆగు మాగుము. (ఉత్తరుని దరికేగి యాతని చేయి పట్టుకొని యాపి) రాకుమారా ! రథమునుండి వైకురికి యేల పారిపోవు చుంటివి ?

ఉ. కు : (కొంచెము వడకుచు) పాపభీతిచేత.

బృహ : పాపభీతియా ?

ఉ. కు : ఔను ; పాపభీతియే ; కేవల పాపభీతి.

బృహ : ఇప్పుడు మనము చేయుచున్న పాపకార్యమేమున్నది?

ఉ. కు : 'చేయుచున్న' కాదు, 'చేయబోవు' అనుము.

బృహ : కానిమ్ము ; చేయబోవు పాపముమాత్ర మేమున్నది.

ఉ. కు : కొండంత యున్నది. మహాసముద్రమంత యున్నది.

బృహ : అదెట్లు ? నీవు చెప్పునది నాకర్థమగుటలేదు.

ఉ. కు : నీవు మందబుద్ధివి.

బృహ : కావచ్చును. అందులకే సూక్ష్మబుద్ధివగు నీవు విషయ మంతయు నాకు విశదముగా చెప్పుట సమంజసము.

ఉ. కు : సరే. విషయము ఇప్పుడు మనము చేయబోవునదేమి ?

బృహ : యుద్ధము.

ఉ. కు : (నొక్కి పలుకుచు) యుద్ధము, యుద్ధము పాప కృత్యము కాదా ?

బృహ : కాదు ; ధర్మయుద్ధ మెన్నటికిని పాపకృత్యము కాదు. ఉపరి క్షత్రియుల కది విహితకృత్యము.

ఉ. కు : (చీదరించుచు) మానవు లొకరినొకరు చంపికొనుట పాపకృత్యము కాదా ? ఘాతుకత్వము కాదా ?

బృహ : కుమారా ! నీవు ధర్మము నపార్థము చేసికొను చున్నావు. ఇందు ఘాతుకత్వ మేమున్నది ? నిరప రాధులఁ జంపువాఁడు ఘాతుకుఁడు. సాపరాధుల దండించువాఁడు రాజు.

ఉ. కు : కురురాజు చేసిన యపరాధ మేమున్నది.

బృహ : మన గోగణము నపహరించుట అపరాధము కాదా?

ఉ. కు : (వెడనవ్వు నవ్వి) బృహన్నలా ! నీ అజ్ఞతకు నాకు నవ్వు వచ్చుచున్నది. నీవు సర్ధనుఁడవైన మేమును నిర్ధనుల మనుకొంటివా ? ఈ గోగణము మాకొకలెక్క

గాదు. ఇవి పోయినచో ఇంతకు రెండింతలు గోవుల సంపాదింతుము — క్షణ మాత్రమున – ఏమనుకొం కొంటివో (చేతులెగురవేసి సగర్వముగ చూచును)

బృహ : (సవిషాదముగ నవ్వి) నిజమే గోవుల సంపాదింప వచ్చును. కాని పోయిన ప్రాణములను సంపాదింప లేముకదా ?

ఉ. కు : ఇప్పు డెవ్వరి ప్రాణములు పోయినవి ? మనము సురక్షితముగనే యున్నామే ?

బృహ : మనము సురక్షితులమే కాని, గోరక్షణమునకై అమాయికులగు గోపాలు రనేకులు మరణింపలేదా ? వారి యసువులు తిరిగి తేగలమా ?

ఉ. కు : చచ్చినవారికై మరి కొందరిని చంపుటయా ? ఇది యేమి ధర్మము ? బృహన్నలా ! నీబుద్ధి వక్రమార్గ మునఁ బోవుచున్నది.

బృహ : గోపాలురు ప్రభుసేవలో మరణించిరి.

ఉ. కు : నాకు నమ్మకము లేదు. మాయనుజ్ఞ లేనిదే యుద్ధము చేయుట వారి మొదటి తప్పు. ఇతరులు తమకంటె బలవంతులవి తెలిసిన తరువాతకూడ పోరుట రెండవ తప్పు. మరణించు వరకును పోరుట మూడవ తప్పు. అట్టి మరణము ఆత్మహత్యా సదృశము. నింద్యము. (నిర్నిమేషముగ ముందుకు చూచి గడగడ వడకును)

బృహ : రాకుమారా! ప్రభుభక్తి పరాయణులను నీవు నిందించు చున్నావు. ఇది రాజధర్మము గాదు.

ఉ. కు: ఓహో! రాజధర్మమును నీవు మాకు బోధించుచున్నావా?

బృహ: బోధించుటలేదు. జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

ఉ. కు: మాకు జ్ఞప్తియందున్నది. (పోఁబోవును)

బృహ: (చేయిపట్టుకొని) ఎక్కడికి?

ఉ. కు: నగరమునకు.

బృహ: అయిన నడచిపోనేల? రథమెక్కుము. అటే పోవుదము.

ఉ. కు: (చేయి విదిలించుకొన ప్రయత్నించి విఫలుఁడై) అబ్బ! నీది రాక్షసబలమే. చేయి వదలము.

బృహ: (నవ్వుచు) నీవు రథ మధిరోహింపుము. చేయి వదలెదను.

ఉ. కు: (కోపముతో) ఎక్కకున్న.

బృహ: బలాత్కారముగ నెక్కించెదను.

ఉ. కు: నీవు సారధివి; నేను రధికుఁడను. నాయాజ్ఞను నీవు పాలింపవలసి యున్నది.

బృహ: ఆ మర్యాదను నీవు దక్కించుకొనలేదు. రథముదిగ్గ నురికినప్పుడే నీవు రథిక గౌరవమును గంగపాలు చేసితివి.

ఉ. కు : (కృత్రిమసౌజన్య ముట్టిపడునట్లు నవ్వుచు) ఆచార్యా! నేను రథారోహణమునెడ నేల విముఖుఁడనై యుంటినో గ్రహించితివా ?

బృహ : (హేళనగ) యువరాజా ! గ్రహింపకేమి ? ఎప్పుడో గ్రహించితిని.

ఉ. కు : (అచ్చెరువుతో) ఏమని ?

బృహ : (నిశ్చలముగ) పందతనమని.

ఉ. కు : (గట్టిగ) అది మాకు స్వప్నమందుకూడ లేదు. మేము వీరులము.

బృహ : అయిన రథమారోహింపుము.

ఉ. కు : సారధీ ! మర్యాద నతిక్రమించి మాటాడుచున్నావు. జాగ్రత.

బృహ : (తీవ్రముగ) బీరములు కట్టిపెట్టుము.

దురమున శత్రుసేనల నెదుర్కొని
　　పోరగలేక పందవై
పరుగిడుచున్న నిన్నుఁగని పార్థివ
　　ముఖ్యులు గేలిసేయరే ?
పురమునఁ దేజముం బలముఁ బూనికయుం
　　గల మేటి పోటరున్
గరువమ వీడి నిన్ను మొనగాడని మెచ్చి
　　నమస్కరింతురే.

ఉ.కు : మేము యువరాజులము, మత్స్యదేశాధీశ్వరుల యేకైక పుత్రులము. మమ్ము తిరస్కరించి మనగలవాడీ దేశమున లేడు ; ఉండఁజాలఁడు.

బృహ : రాకుమారా ! నీ యాభిజాత్యము సర్వజన విదితమే. కాని యిప్పుడు నీవు స్వధర్మమును వీడి పతితుఁడ వగుచున్నావు.

రణమున వెన్నుసూపక యరాతిబలంబుల
నోర్చి, ధర్మర
క్షణ మొనరించునాఁడె నృపసత్తముఁ
డుర్వరఁ బేరుగాంచుఁ, బా
వనమగు ధర్మమార్గమునుబాసి చరించు
నృపాధముండు మే
దిని నపకీర్తిపాలగుఁ దుదిన్నిరయంబును
బొందు దీనతన్.

నీవు సుక్షత్రియుఁడవు. కావుననే ధర్మ్యమగు నీ యుద్ధము నీకు సర్వధా కర్తవ్యము. 'యశోవా మృత్యుర్వా' అను దృఢ నిశ్చయముతో సంగర రంగమున కురుకుము. శూరజన గర్హ్యమగు భీరుత్వ మును వీడుము. లెమ్ము.

(అనతిదూరమున వీరభట హుంకారములు, గజఘీం కృతులు, హయ హేషలు వినవచ్చును.) (భయకంపితుఁడై

యుత్తరుఁడు మరల పారిపోవ యత్నించును. బృహన్నల యాతనిని గట్టిగా పట్టుకొనును.)

ఉ. కు : (వెలవెలపోవుచు) బృహన్నలా! నీకు వేయి నమస్కారములు. నన్ను వదలిపెట్టుము.

బృహ : (నిశ్చలముగ) వదలను.

ఉ. కు : (దీనముగ) చూడు బృహన్నలా! అకృతాస్త్రుఁడను. బాలుఁడను. నేనెక్కడ, సకలశాస్త్ర కోవిదులగు గురు భీష్మాదు లెక్కడ? ఆ మహావీరులకును నాకును హస్తిమశకాంతర మున్నది. వారు దేవాసురుల కజేయులు. చతురంగబల సమన్వితులు. నేనిప్పటి కొక్కమారుకూడ కదనరంగమున కాలిడినవాఁడను కాను. నిస్సహాయుఁడను. ముందు వెనుక లాలోచింపక, స్వపర బలభేదమును గుర్తింపక, బాలుఁడనగుట నేనీ యుద్ధముఁ జేయ బయలుదేరితిని. కాని, బాల్య చాపల్యమున నేనెంతటి యనుచిత కార్యమొనర్ప సాహసించితినో నాకిప్పుడు తెలిసినది. ఇంక నాలసించుట తగదు. మనగుట్టు చెడకుండ నిగూఢముగ మరలి పోవుట యుక్తము.

బృహ : రాకుమారా! నీ మాట లర్థశూన్యములుగ నున్నవి. తొలుత రథముపై నడుగిడునప్పటికంటె, యిప్పుడు నీ వెఱింగిన విశేషము లేమున్నవి? నిన్న సైన్య

మిప్పటికి తేరిచూడనైన లేదుకదా! అట్టియెడ వారి బలపరాక్రమములు నీకెట్లు తెలిసినవి. పౌరులెల్లరు నిరవధికమగు నుత్సాహముతో, నిశ్చలమగు విశ్వాసముతో, మనలనిటకు సాగనంపిరి. నీవు, కురుబలము నవ్రశమంబున జయించి, గోగణమును మరలించుకొని వత్తువని, వారి నమ్మకము. ఇప్పుడు వారి నమ్మకమెల్ల వమ్ముచేసి, నీవు శూన్య హస్తములతో, తిరిగి పోయినచో, వారికి నీయెడ నిసుమంతయైన గౌరవముండునా? ప్రత్యక్షముగ చెప్పకున్నను లోలోపల వారు నిన్నసడింపరా? పరిహాస మొనర్పరా?

ఉ. కు: బృహన్నలా! పురజనుల దూషణ భూషణ తిరస్కారములతో నాకు సంబంధము లేదు. ఒరులు మెత్తురని నే నగ్నికాహుతి యగుదునా? వెంగలితనము మాని, నీవు కూడ రమ్ము. మనకిప్పుడు పలాయనమే శరణ్యము.

బృహ: రాకుమారా! ఈ పిరికిమందు నీ కెవ్వరు నూరిపోసిరి? వీరవరులకు విహారభూమికదా సంగర రంగము. నీవలె బీతిలి నేను మరలువాడను కాను. ఈ కురుబలమే కాదు, ముల్లోకము లొక్కపెట్టున నెత్తివచ్చినను నేను వెనుకంజ వేయను. అరు లాలమందల గొనపోవుచుండ జూచుచు నూరకుండుటకు

నేను భీరువును గాను. అంతఃపుర కాంతలముందు, బీరము లెన్నియేని పల్కి, యిప్పుడధీరుఁడవై మరలి పోవుట, నీకుమాత్రము యశోదాయకమా? గోగణాప హర్తలను జయించి, విజయుఁడవై నీవుపోయినచో నంతఃపురాంగనలు సంతసింపరా?

ఉ. కు: బృహన్నలా! నీ చిలుకపలుకులను గట్టిపెట్టుము. నాకు వినువెత్తుచున్నది. ఎంతసేపు చెప్పినను ఒకటే విషయమా. అంతఃపురాంగనలు; ఆలమందలు — ఆలమందలు. అంతఃపురాంగనలు. (గంభీరము) నాకంతఃపురాంగనల పేద మోదములతోఁ బని లేదు. ఆలమందలమాట దేవుఁడెఱుగు. నేనది చేయజాలను. నేను బాలుఁడను; శస్త్రాస్త్ర విద్యాప్రాభవ హీనుఁడను.

బృహ: నీవు చెప్పుమాటలు లోకధర్మమునకుగూడ విరుద్ధములుగ నున్నవి. యుద్ధమొనర్చినప్పుడుగదా స్వశక్తికిని పరశక్తికిని గల తారతమ్యము తెలియగలదు. అట్లుగాక, వైరులు నీవంకఁ జూడనైన జూడకముందే, భయకంపిత చిత్తుఁడవై పారిపోవుట నింద్యము.

ఉ. కు: (క్షణమాలోచించి) బృహన్నలా! ఇన్ని నీతులు చెప్పుచుంటివేగాని, ముఖ్యవిషయమును నీవు గుర్తించుట లేదు.

బృహ : కదనరంగమున మదోద్ధతులగు కురువీరుల భంజించుట కంటె ముఖ్యవిషయ మేమున్నది యువరాజా !

ఉ. కు : ఉన్నది, అంతకంటె మహత్తర కార్యమొకటి యున్నది.

బృహ : ఏమది ?

ఉ. కు : అంతఃపుర రక్షణము. పౌర పరిరక్షణము. ఎంత పొరపాటు : మహారాజు యుద్ధమున కేగుచు నగర రక్షణమున గదా నన్ను నియోగించిరి. నా ప్రథమ కర్తవ్యము నగర రక్షణము. విహితకృత్యమును వీడి వెంగలినై యిటకు నేతెంచితిని. ఇది కర్తవ్యపరాఙ్ముఖతకు ప్రబల నిదర్శనము. ప్రభు ధిక్కారము. ఇంకను చూచెదవేల ? ఆలసింపకుము. ఎట్టిప్రమాదమును రాకమున్నె మన మక్కడి కేగవలయును. నివు రాకున్న మానె; నన్నైన( బోనిమ్ము.

బృహ : ఇంతటి మహావీరు(డవు. నీవుపోయిమాత్ర మచ్చట నేమి చేయగలవు ? ఈ పెడయుక్తులు మాని, యుద్ధమొనరింప సంసిద్ధు(డవు కమ్ము.

ఉ. కు : సారథీ ! నీ కెన్నిమారులు చెప్పవలెను ? నేను యుద్ధము చేయను; చేయ( జాలను. పౌరులు నవ్విన నవ్వుదురుగాక. అంతఃపురాంగనలు మేలమాడిన నాడుదురు గాక ! చచ్చి సాధించునదేమున్నది ? క్రొవ్వి

యున్నచో నీవే ఆ కురుసేనతోఁ దలపడి పోరరాదా ? ఎవరు కాదనిరి ? (దీనముగ) మా అమ్మకు నేనొక్కఁడనే పుత్రుఁడను. ఆమె వేయికన్నులతో నారాక కెదురు చూచుచుండును. ఆ మాతృహృదయమునఁ జిచ్చు పెట్టకు. నన్ను బోనిమ్ము. మరొకమాట, నీకు కావలసినంత ధనమిచ్చెదను. రత్నరాసు లిచ్చెదను. కావలసిన నగ్రహారముల గూడ నిత్తును. నన్ను మా అమ్మకడకుఁ బోనిమ్ము; నికు పుణ్యముండును.

బృహ : (విషాదముగ నవ్వి) నీ బేలతనము చూచిన నాకు నవ్వు వచ్చుచున్నది. నీవిచ్చు ధనముగాని, రత్నరాసులు గాని, అగ్రహారములు గాని, నాకక్కరలేదు. సరే కానిమ్ము. నీవు యుద్ధము చేయకున్న నేనే చేసెదను. మన గోధనముపై దురాక్రమణము గావించిన యీ కురుబలమును మన మెదుర్కొనక తప్పదు. ఆలమందల మరలింపక తప్పదు. సైరంధ్రి నన్నొక పెద్దఁజేసి నీతోఁ బంపినది, రాకుమారి నన్నభ్యర్థించినది. అసాధ్యములను గూడ సాధించి, నీకు జయము గల్గింతునని, నేను వారిద్వరకును మాట యిచ్చి యున్నాను. పౌరులందరును మనరథము బయలుదేరుచుండ జయజయధ్వానములు గావించిరి. వారందరి విశ్వాసమును నేను వమ్ముసేయను. నేనే సంగరరంగమున కురికి యరాతివీరుల నుగ్గు చేసెదను.

భూ.కు : (ఆశ్చర్యముతో) నీవు-నీవు యుద్ధము చేయుదువా? నిజమా? హాస్యమున కనలేదు కదా?

బృహ : (తీవ్రముగ) ఇది హాస్యమునకు సమయము కాదు. రమ్ము; పోవుదము.

భూ.కు : ఎచ్చటికి?

బృహ : ఆ కనఁబడుచున్న జమ్మికడకు.

భూ.కు : నీకేమి పిచ్చిపట్టలేదు కద! అక్కడికెందుకయ్యా! ఆ జమ్మి నాశ్రయించుకొని భూతప్రేత పిశాచము లున్నవని పెద్దలందురు,

బృహ : నేనుండగా నిన్ను భూతములే కాదు; భూతనాథుఁడు కూడ ముట్టలేఁడు. భయము వలదు. నావెంట రమ్ము.

భూ.కు : నడువనేల! రథమెక్కియే పోవుదము.

బృహ : అట్లే కానిమ్ము. (నిష్క్రమింతురు)

.... తెర ....

## ద్వితీయరంగము

(చండ ప్రచండులను సేనానాయకు లిద్దరు ప్రవేశింతురు)

ప్రచం : చండా! ఆవింత చూచితివా?

దండు : చూడకేమి? చక్కగాఁ జూచితిని. వ్యవహారమం తయు నస్తవ్యస్తముగ నున్నది.

ప్రచం : సారథి రథికుఁడైనాఁడు, రథికుఁడు సారథియైనాఁడు ఇదెక్కడి చోద్యము.

దండు : ఆ బాలుఁడెవ్వఁడో! చూచుటకు రాకుమారునివలె నున్నాఁడు.

ప్రచం : ఆతఁడు నిశ్చయముగ రాకుమారుఁడే. సందియము లేదు.

దండు : మత్స్యదేశాధినాథునకు త్తరుఁడను తనయుఁడున్నట్లు వినియుంటిమి. ఆతఁడే ఈబాలుఁడేమో!

ప్రచం : ఈబాలుఁ డుత్తరకుమారుఁడే యై యుండును. త్రిగర్తవాహినులతో సంగరమొనరింప విరాటరాజేగి యుండును రాజునకేకైకపుత్రుఁడగావున నీతఁ డంతిపురముననే, విలాస వినోదములఁ దేలియాడుచుండనోవు. కాని, మన మిచ్చటికివచ్చి గోపాలుర నదలించి, గోగణమును బొరిగొంటిమనువార్త నగరము సేరగనే, స్వబల పరబల తారతమ్యము నెరుఁగని బాలుఁడగుట మనతో ననిసేయ బయలుదేరియుండును. కాని త్రిలోక భయంకరమగు నీ కురుసైన్యమును జూచినంతనే, భయమంది యుండును.

చందు : భయకంపిత చేతస్కు(డై పారిపోవుచున్న యుత్తరు నాప యత్నించిన యా వికృతాకారు( డెవ్వ(డై యుండును ?

ప్రచం : ఎవ్వ(డో ? సరిగా( జెప్పజాలను. కాని కొంత యూహించుట కవకాశ మున్నది.

చందు : ఎట్లు ?

ప్రచం : ఆజానుబాంబి దీర్ఘ బాహార్గళల( జూచితివా ? ఆ విశాల నేత్రములను, ఆ పీనవక్షమును జూచితివా ?

చందు : చూచితిని.

ప్రచం : వానినిబట్టి నీ కేమి తెలియుచున్నది ?

చందు : అత(డు, ప్రచ్ఛన్నవేషమున నున్న మహావీరు(డని యూహింప నవకాశమున్నది. ఆ( — ఉండు ముందుము : అత( డర్జును(డే కావచ్చును. ఆ తేజో విశేష మా వీరచూడామణి రూపరేఖల( బట్టి యిచ్చుచున్నది.

ప్రచం : ప్రచ్ఛన్నరూపమున నున్న యీ పురుషసింహుని బల పరాక్రమముల నా రాకుమారు( డినుమంతయు నెరు(గడు. కావుననే వెరచి పరుగులు వెట్టినా(డు.

(భీష్మ ద్రోణులు ప్రవేశింతురు)

చందు : అరుగో ! భీష్మ ద్రోణు లిటే వచ్చుచున్నారు. మన మిచ్చట తడయుట పాడిగాదు, రమ్ము; పోవుదము.

(ఇరువురును నిష్క్రమింతురు)

ద్రోణు : సురనదీ నందనా ! మన సైన్యమునఁ దోచు నీ యుత్పాతముల నీక్షించితివా.

మాసె నుడువీధి నాదిత్యమండలంబు :
కారుమెయిళులు గగనమ్ముఁ గ్రమ్మకొనియె :
అంధకారమ్ము దెసలెల్ల నాక్రమించె ;
పడియె నుల్కలు చండాంశు ప్రభలతోడ.

ఔదలల్వంచి భద్రానేకపంబులు
ముందర మిన్నక మ్రొగ్గుచుండె ;
జాలిగొల్పంగ నాజానేయములు గూడ
కన్నుల బాష్పము ల్గార్చుచుండె ;
ఆయుధ ప్రకరఁబునందు మంటలుదోచెఁ
దడబడి పడగలు తగ్గుచుఁడె
ఉరుజన ప్రవికంపితోర్వీజపటలియై
కరువలి యపసవ్యగతుల వీచె,
శంఖకాహళ భేర్యాది సకలవాద్య
ములును విపరీతరవముల మ్రోగుచుండె
కటురవమ్ముల గోమాయుగణము గూసె,
కావు మనకివి మంగళకారకములు.

ఈ యుత్పాతముల నన్నిటినిబట్టి చూచినచో, మన కిప్పుడు భయదమగు యుద్ధము తప్పదని తోచుచున్నది.

భీష్మ : ఆ యుద్ధమున జయము గొనుటయు నసంభవమే యని నిశ్చిత మగుచున్నది. (ద్రోణునివంక సాభి ప్రాయముగఁ జూచును)

ద్రోణు : (మెల్లగ) వీని కిప్పుడిది తగునా ? తన యహం కరణమే తనదియా ? ముందు వెనుక లాలోచించి, మంచి చెడుగుల గణించి మెలఁగవలదా ? ఒక బ్రాహ్మణుని పేర నిటు చేరవచ్చుచున్నాఁడు. కురునాథుఁ డీతనిఁ జూచి, గుర్తించినచో నింకేమున్నది ? అంతయుఁ దారుమారగును కదా !

భీష్మ : (గట్టిగనే)

తలఁప రిపులకు నిమ్మగుకొలఁది గడచి
వచ్చినార మకుంఠిత బాహుబలము,
నెరపగా సమయమేతెంచె నిశ్చితముగ,
శాత్రవుల గాంచి చలియింపఁ జనదు మనకు.

ద్రోణు : గాంగేయా ! సత్యము వచించితివి. ఈ యుత్పాత ముల గాంచి కొందరు వికల మనస్కులగుచున్నట్లు న్నది, వారిని హెచ్చరించుట మన విధి; (ఎలుఁగెత్తి) ఓ వీరవరులారా ! ధనుర్విద్యా విశారదులారా ! మీ మీ శక్తిసామర్థ్యములఁ బ్రదర్శింపఁదగు సమయము వచ్చినది. ధైర్యకవచముల ధరించి గోగణముల సంరక్షింపుడు. రథికులారా ! పిరికికండలేని బిరుదు

మగలు మీరు. కురురాజు కీర్తి ప్రతిష్ఠలు మీపై నాధారపడి యున్నవి. లెండు. అదృష్టపూర్వమగు. భయద సంగ్రామమున కాయత్తము కండు. మన కిప్పట్టున యుద్ధము తప్పదు.

మొనల నొప్పుగఁ దీరిచికొనుఁడు వేగ;
వాహనమ్ముల నాయుధవ్రాతములను,
జనుల నెల్లర ననువుగ నునిచికొనుఁడు
గోగణంబుల రక్షించుకొనఁగ వలయు.

యోధాగ్రేసరులారా! అన్నిటికన్న మిన్నగ మన మిప్పుడు రాజరక్షణమున నప్రమత్తులమై యుండ వలయును

(దుర్యోధనుఁడు ప్రవేశించును)

దుర్యో: (నవ్వుచు) ఆచార్యా! ఆ పేడికి భయపడియేనా యీ యార్భాటము?

ద్రోణు: ఆతఁడు పేడియా దుర్యోధనా?

మనుజనాథులు సూడ మత్స్యయంత్రము నేసి
ద్రౌపది గొన్నట్టి ధన్వియతఁడు
ఖాండవం బేర్చి యాఖండలు ననినోర్చి
విజయమందిన మేటివీరుఁడతఁడు

ఎక్కటికయ్యంబు ముక్కంటితోఁ జేసి
పేరు గాంచిన మహాశూరుఁ డతఁడు
కాలకేయాది రాక్షసకోటిఁ జంపిన
చండప్రతాప తేజస్వియతఁడు
బవరమందున గంధర్వపతిని గెల్చి
కౌరవేశ్వరు గాచిన ఘను డతండు
పేడి యాతండుగాఁ దరిభికరుండు.
అర్జునుండు మహాహవదుర్జయుండు.

దుర్యో: ఆతఁ డర్జునుఁడా? అయినచో మన కభీష్టసిద్ధి యైనట్లే.

ద్రోణు: నీ యభీష్టమేమి? అది యెట్లు సిద్ధించినది?

దుర్యో: పాండవులు మరల పండ్రెండేండ్లరణ్య వాసమును, ఒకయేడజ్ఞాతవాసమును గావించుటయే మా యభీష్టము. ఇప్పు డర్జునుని మూలమున సమయభంగ మైనది. కావున నది సిద్ధించినది

ద్రోణు: సుయోధనా! నీయూహ సమంజసముగనే యున్నది. కాని అది నీయూహ మాత్రమే. పాండవులకు సమయ భంగము కాలేదు; వారికింక నరణ్యవాస క్లేశమును గాని, అజ్ఞాతవాస శ్రమనుగాని పడవలసిన పనిలేదు.

దుర్యో: అస్త్రగురులు పాండవ పక్షపాతులను విషయము జగద్విదితము. (భీష్మునితో) పితామహా! పాండవ

ధార్తరాష్ట్రులు మీకు సమానులు. మీరే యీ విషయమున ధర్మనిర్ణయము గావింపవలయును.

భీష్మ : నే నిదివరకే లెక్కించి చూచితిని. అధికమాసములతోఁ గూడ నిన్నటికే పదమూడేండ్లును నిండినవి.

దుర్యో : అధికమాసములనుగూడ లెక్కించితిరేల ?

భీష్మ : అవి యున్నవి కనుక.

దుర్యో : అధికమాసములతో లెక్కింతుమని వారు చెప్పలేదు.

భీష్మ : లెక్కింపరాదని నీవును జెప్పలేదు.

దుర్యో : మేమేల చెప్పెదము,

భీష్మ : సమయ నిర్ణయమును జేసినవాఁడవు నీవే కావున. దాని నిశ్చిత స్వరూపమును నిష్కృష్టముగఁ దెలుపవలసిన విధి నీ యందే యున్నది.

దుర్యో : ఇది కేవలమధర్మము.

భీష్మ : (హేళనగ) ధర్మ రహస్యములను నీవే చెప్పవలయును.

దుర్యో : అనిశ్చితమగు నీ విషయము నాధారముగాఁ గొని యధర్మమునకుఁ బాల్పడుట ధర్మజునకుఁ దగనిపని.

భీష్మ : (సక్రోధముగ) నిజమే ధర్మసూత్రము లన్నియు ధర్మజునికొఱకే నిర్దేశింపఁ బడినవి.

దుర్యో : ఏది యెట్లున్నను వారికిమాత్రము నేను సూది మొన మోపినంత భూమియు నిచ్చువాఁడను గాను. (సాకూతముగ) ఇటు సూర్యుఁ డటుదయించినను, ధర్మజుఁడు

ధర్మపథమును దప్పి చరించువాఁడు కాఁడని పెద్ద లందరు ననుచుందురు కదా యని (అర్ధోక్తి)

భీష్మ : కదా అని ; ఉఁ ; వాక్యమును బూర్తిచేయుము.

దుర్యో : పూర్తిచేయుట కేమున్నది ; నేనీ ధర్మవిచికిత్సను బరిష్కరింపుఁడని మిమ్ము గోరితిని.

భీష్మ : లేకున్న నీకు ధర్మాధర్మ ప్రసక్తియే యుండదన్న మాట.

దుర్యో : (ఇంచుక కినుకతో) పితామహా ! మీరు కురు వృద్ధులు ; మాకందరకు బూజ్యులు. మీరిట్లనుట పాడి గాదు. ఈ ప్రపంచమున, ధర్మరాజొక్కఁడే ధర్మవిదుఁడని మీరు తలంచుచున్నట్లున్నది. అది పొరపాటని మీరు గ్రహించుట మంచిది.

భీష్మ : (విషాదముగ) గ్రహింపకేమి ? గ్రహించియే యుంటిని; గ్రహించియు మరల మరల పొరపడుచునే యుంటిని. ఇవన్నియుఁ దెలియక చేసినవి కావు. తెలిసియే చేయుచుంటిని. పాపము సేయువాఁడే కాదు. చేయించువాఁడును, ప్రేషకుఁడును, అనుమోదకుఁడును నరకమును బొందుదురని ధర్మజ్ఞులు చెప్పుదురు. ఆ నల్వురలో నేనుకూడఁ జేరుదును. నా పాపములఁ బాపి నన్నుగావ నాజగత్ప్రభువును వేడుకొనుచున్నాను

ద్రోణు : ఆపగానందనా ! విషాదమున కిదియా సమయము? గతజల సేతుబంధనమేల ? కదనము సేయ వచ్చు చున్నవాఁడు కవ్వడి. ఆ జగదేకవీరునితోఁ బోరి

నిల్వఁగల వీరులు మనసేనయం దెందరు కలరు ?
త్రిశూలి నోర్చిన బలశాలి యతఁడు.

దుర్యో : ఆచార్యా ! అర్జునుఁడు పరాక్రమశాలియే కావచ్చును. అంతమాత్రమున నాతని నోర్చు శూరులే మనసేన యందు లేరనుట యతిశయోక్తి కాదా ! అర్జునుఁడు మీ ప్రియశిష్యుఁడే కావచ్చును. అందుల కాతని పంటివలెఁ బొగడుటనుచితము.

ద్రోణు : సుయోధనా ! నీకు పెక్కుసారులు చెప్పితిని. ఇప్పుడు మరల చెప్పుచున్నాను. నీ వంగరాజును నమ్ముకొని యున్నావు. అతఁడే కాదు, అట్టివారు పదిమందియైనను, ఆహవమున నర్జును నోర్వఁజాలరు.

దుర్యో : (నవ్వి) సహజకవచకుండల మండితుఁడు, పెక్కు సంగరముల రాజలోకమునెల్ల నుక్కడించి, జయము గాంచిన జగజెట్టి, అంగరాజే యర్జును నోర్వఁజాలఁడా?

(కర్ణుఁడు ప్రవేశించును)

కర్ణు : ఆచార్యా ! అర్జునునకు వెరచువాఁడంగరాజు కాఁడు, అస్త్రగురుఁడు.

ద్రోణు : (విస్మయముతో) నేనా ?

కర్ణు : ఔను ; మీరే.

ద్రోణు : (సక్రోధముగ) కర్ణా !

కర్ణు : (శాంతముగనే) ఎందులకా క్రోధము ? నిజమాడిన నిష్ఠురముగా నుండును. కాని, నేను నిజమే చెప్పెదను. మీరు పూజ్యులు. కాని వృద్ధులైనారు. శరీర పాట

వము తప్పుచున్న మీరు, శాంతులై తపము చేసి కొనుట మంచిది. సమర ప్రసంగములు మీ కేల? వానిని మాకు వదలివేయుఁడు. దూరమునుండి మమ్మాశీర్వదింపుడు. అదియే మీరు మాకు చేయగల సాహాయ్యము.

దుర్యో: (సంతసముతో) కర్ణా! నీ బాహుబలము వలెనే నీ బుద్ధిబలముకూడ ననుపమానమైనదే. ఎంత చక్కని మాటలు చెప్పితివి? ఇంత మంచియూహ యింత దనుక మా కెవ్వరికిని తట్టనేలేదు.

ద్రోణు: (క్రోధకంపితుఁ డగుచు) సుయోధనా!

కర్ణు: ఆచార్యా! మత్ప్రియ మిత్రుఁడు మిమ్ము కేవలము దూరము సేయునేమో అని భయపడుచున్నారా? ఆ భయమువలదు. విందులు, వేడుకలు మున్నగువానిలో మీరుండనే యుందురు. కావలసిన నందు మీరగ్రస్థానమునే యలంకరింపవచ్చును. మాకెట్టి యభ్యంతరము నుండదు. ఇఁక రారాజు నిండు కొలువుండు నపుడు శాస్త్ర చర్చలుగూడ జరుగుచుండును గదా? అందు మీరు మీ వాక్చాతుర్యమును, క్షమింపుడు, వాక్చాతుర్యమును జూపవచ్చును. అందుఁగూడ మీ కలసట యగుచో, మీ ప్రియతనూజుఁడె మిమ్మాదుకొన వచ్చును లెండు. (దుర్యోధనునితో) ఎట్లున్నది మిత్రమా!

దుర్యో: బ్రహ్మాండముగ నున్నది. వార్థకమున నాచార్యుఁడు వానప్రస్థమును స్వీకరించుటయే యుచితము.

కర్ణు: ఏకవృత విషయము కదా! పాప మశ్వత్థామ గూడ నస్త్రశస్త్రములు వీడి యాచార్యుల ననుసరించుటయే మంచిది. పెద్దల మనసెరిగి యుపచారము సేయువా రుండవలదా?

(అశ్వత్థామ ప్రవేశించును)

అశ్వ: సూతనందనా! అస్త్రసన్న్యాసము సేయుమని అశ్వత్థామకే చెప్పఁగల సాహసివైతివా? కుమతీ! నీ కుల విద్యను నీవు మఱచితివేమో! బండ్లుతోలుకొను నీవు, మహోద్దండ పాండితీ ప్రచండులగు మహావీరులఁ బరిహసించుటయా?

క్రొవ్వి యిటు కారుకూతలు గూయవచ్చు
గాని నిర్జింపవచ్చునే కర్ణ నీకు
మహిత గాండీవనిర్ముక్త మార్గణజిత
జంభదైత్యనిషూదను సవ్యసాచి,

చెనటీ, నీధైర్యసాహసములు నేనెఱుంగనా? (సుయోధనుని వంక జూచి) సుయోధనా! అతిశయిత సురాసుర ప్రభావుఁడగు నస్త్రగురు నిర్వీరిడి యధిక్షేపించి, యవమానము సేయుచుండగాఁ జూచి యూరకుందువా?

దుర్యో: గురునవమానించిన వారెవ్వరు ? శత్రువును వందివలెఁ బొగడుచు, ఆతఁడే మమ్మవమానించెను.

అశ్వ: దేవదానవులకు గూడ దుర్జయుఁడగు నర్జును శ్లాఘించుట దోషమా ? నయ విక్రమముల నతిలోకుఁడగు నమ్మహనీయుఁడు సర్వజనశ్లాఘ్యుఁడు కదా ! అట్టి యెడఁ బుత్ర నిర్విశేషుఁడగు నిజ ప్రియశిష్యుని గురుఁడు శ్లాఘించెను. అందు తప్పిదమేమి కలదు.

దుర్యో: తప్పిదమే. అది కురురాజునకే యవమానకరము.

అశ్వ: (తీవ్రముగ) సుయోధనా !

కావలివారిఁ దోలితివి గాని, మహోగ్ర
బలప్రభావ సం
భావితులైన శాత్రవుల మార్కొని
గెల్వగలేదు ; దీనికై
యీవిధి విఱ్ఱవీగి యవహేళన సేయుదె
దుర్మదంబునన్
భూవినుత ప్రతాపగుణభూషితు మజ్జనకుం
దయానిధిన్.

జూదమున సిరులగెల్చుట
గాదిది ; పరిపంధివీర కంఠీరవ సం
క్షోదక్షమ దోర్బల విధ
వోదితఘనకీర్తి విజయు నోర్వగవలయున్.

దుర్యో : క్రోధమున గురుపుత్రు లొడలు మరచి యరచు చున్నారు.

కర్ణు : అకాండతాండవము సేయుచున్నారు.

అశ్వ : సుయోధనా ! కర్ణా ! నీటికి నాచు తెగులు ; మాటకు మాట తెగులు ; మీతో వాదమేల ? ఇట్లకారణముగ నవమానింపఁ బడియు సిగ్గుమాలి ద్రోణుఁడు రణంబు సేసినఁ జేయుఁగాక, నేనుమాత్ర మిట్టి యవహేళనల నహింపఁ జాలను.

దుర్యో : (ఆతురతతో) గురుపుత్రా !

కర్ణు : మిత్రమా ! నీకేల యీ భయము, ఆతఁడు రణపరాఙ్ముఖుఁడైనంత మాత్రమున నకాల ప్రళయము సంభవించునా ? మన మిచ్చటికేల వచ్చితిమి ? కయ్యము సేయుటకా ? కవ్వడిని బొగుడుటకా ? పాండవు లిచ్చట నుండి యుందురనియు నిరువంకల మన సేనలు ముట్టడి చేసినచో పాండవులు బయలుపడక తప్పదనియు, నంతట వారికి సమయభంగ మగు ననియు నూహించియే కదా మన మిటకు వచ్చితిమి. ఇప్పుడు విల్లచ్చుని జూచి మనము విచలితమనస్కులమై, కర్తవ్యమును మరువవచ్చునా ? పార్థునిగాంచి నంతనే భయకంపితులగు నీ భీరువులు యుద్ధరంగమున నున్ననేమి? యూడిన నేమి? ఒక్కవీరునితోఁ బోరానర్పుట కొక్కవీరుఁడు చాలును. ఒంటరిగవచ్చు నాతని నింద రెదుర్కొనుటయుఁ దగవుగాదు.

వెరచినవారలెల్ల నని వీడఁడు; నే
నొకరుండనే భయం
కరసమరాంగణంబున నఖర్వ బలోద్ధతి
గ్రీడినోర్చెదన్,
హరులను జంపి తద్ధ్వజమునందలి
భూతగణాళి నొంచెదన్
తరపఁగ మామకీన శరసంతతి నభ్రపదంబు
గప్పెదన్.

పాండవమధ్యముని బలపరాక్రమములు జగత్ప్రసిద్ధములై యున్నవి. నేనుగూడ శౌర్య ధైర్యములు గలవాఁడనపోలె వసుధాధిపు సైన్యమున వర్తించుచున్నాఁడను. సమయము రానేవచ్చినది. ఇప్పుడే మేమిర్వురము నొండొరులకు శస్త్రాస్త్ర విద్యాప్రావీణ్యమును, బాహుబల విక్రమాటోపమును బ్రకటించుకొనుట యుచితముగదా! పోరుచూడ నిష్టముగలవారలుండవచ్చును. లేనివారు యథేచ్ఛగాఁ బోవచ్చును.

భీష్మ: అంగరాజా! రారాజు నిన్ను మన్నించినంత మాత్రమున, క్రిందుమీఁదెరుంగక పూజ్యులగు నాచార్యుల నవమానించుట తగని పని.

కర్ణు: (నవ్వి) తగనిపని నాదా? వారిదా?

అందరు వచ్చినారు రిపు నాహవమందున
నోర్తుమంచు, నే
డిందుల కేగుదెంచి. నృపు నించుకయైన
గణింపకుండ, సం
క్రందన సూనునిం బొగడగా దగి
యున్నదె వారికి న్నదీ
నందన ! పక్షపాతమును నాపయి
నిందలువేయ బాడియే.

పూజ్యులెవ్వరు ? కడు పార భూమిధవుని
విత్తముందిని వేళకు విడుచు వారొ ;
అవనిపతి సేయు మన్నన యప్పు దీర్ప
నాహవంబున నురికెడు నట్టివారొ.

భీష్మ : కర్ణా ! నీ మాటలు మితిమీరు చున్నవి. నీవంటి వాచాలుని, యుక్తాయుక్త వివేకహీనుని, నమిత్రు. పూజ్య పూజావ్యతిక్రమము గావించుచున్న సుయోధను నన వలయును. నిన్నని యేమి ప్రయోజనము ? హు. నీవొక్కడవే రాజరాజు మేలుగోరువాడవా? మేమందరము నాతని సేయుభూరిసమ్మానము లందికొని, వేళకాతని విడుచువారమా? ఎంత దురహంకారపూర్ణము లీవాక్యములు? కానిమ్ము. నీతో మాకు వాదమేల? నిన్నే నమ్ముకొనియున్న సుయోధననికై నీవేపోరుట

యుచితము. మాకేల యీ 'పిలువని పేరంటము',
చెప్పనివిందు. (పెడమొగము పెట్టుకొనును.)

ద్రోణు: (ఆతురతతో) గాంగేయా! శాంతింపుము; అంగరాజు పల్కులకలుకవహించుట తగునా? ఆతఁడెప్పుడును పిన్నపెద్దల తారతమ్యమును గణింపకయే మాటలాడుచుండును. ఆ వాచాలుని మాటల కలిగి మనము కర్తవ్యపరాఙ్ముఖులముగారాదు.

తలపరు వెరుగక కర్ణుఁడు
నిలుకడ సెడి యాడినంత నెరజోదులకున్
విలువ సెడునె? యెవరెవ్వరో
కలనఁ దెలియుగాదె మనకుఁ గలఁతలిఁకేలా?

(సుయోధనునివంకఁ జూచి) సుయోధనా! ఆలోచనల కిది సమయముగాదు. త్వరపడుము, పితామహుని బ్రసన్నుని జేసికొనుము.

దుర్యో: (భీష్మునికడకేగి) నా యవివేకమును మన్నించి ప్రసన్నులు కండు.

భీష్మ: సుయోధనా! నేనెప్పుడును నీ మేలు గోరువాడనే. నామాటకేమి? పోటుమాటలచే సూటిగ మీరస్త్రగురు నవమానించిరి, చస్సహావమానమునకు గురియైన ద్రోణులే నీయెడఁ బ్రసన్నులగునపు డిఁక నాకేల

విచారము? ఇప్పుడైన నాచార్యుల యౌదార్యమును, శిష్యవాత్సల్యమును నీకుఁ దెలిసినవా?

దుర్యో: అస్త్రగురు లమృతహృదయులు. (కర్ణునితోఁ గూడ ద్రోణునికడ కేగి) గురుదేవా! మా యపరాధములు సైరించి మమ్మనుగ్రహింపుఁడు.

ద్రోణు: (గద్గదస్వరముతో) సుయోధనా! నాకు నీవొకటియు నశ్వత్థామ యొకటియుఁ గాదు. ఇర్వురును సమానులె. మా యశ్వత్థామయెడ నేను కినుకవహింతునా? అంగ రాజా! నీ స్వామిభక్తి నాకుఁ దెలియనిదికాదు. (అశ్వత్థామవంకఁ జూచి) నాయనా! అశ్వత్థామా!

అశ్వ: (ఆనందముతో) తాతపాదులు ప్రసన్నులైనపుడే నా కినుక మాయమైనది. మదీయ నిశిత మార్గణములు వైరివీర రుధిరాస్వాదనమునకై యువ్విళ్ళూరు చున్నవి.

ద్రోణు: అదృష్టవశమునఁ గలఁతలన్నియు మటుమాయమైనవి. ఇంక తడయనేల? రణరంగమున నిర్దిష్టస్థానముల నిలిచి సవ్యసాచి నెదుర్కొందము; రండు —

(అందరు నిష్క్రమింతురు)

తెర

*

# తృతీయాంకము

## ప్రథమ రంగము

(బృహన్నలయును త్తరుఁడును ప్రవేశింతురు)

ఉ. కు: (గజగజలాడుచు) సా ర_థీ!

బృహ: ఏమి రాకుమారా!

ఉ. కు: ఈ చెట్టుమీది భూతములు నన్ను మ్రింగవుకద! మా రాజ్యమునకు నేనొక్కఁడనే వారసుఁడను.

బృహ: నేనుండగా నీకేల భయము? అసలిందు నీవనుకొనుచున్నట్లు భూతములు లేవు.

ఉ. కు: భూతములు గాకున్న ప్రేతములు; ప్రేతములుగాకున్న పిశాచములు — ఇందుండుననినే మా అమ్మ చెప్పినది. కావలసిన నామీద_కాదుకాదు_నీమీద. (బృహన్నల తీవ్రముగఁ జూచును) కాదుకాదు_దేవునిమీద ఒట్టు.

బృహ: (నిట్టూర్చి) రాకుమారా! ఈ భీరుత్వము హేయము.

ఉ. కు: ఇందు భీరుత్వమేమున్నది? నీవుమాత్రము కానరాని భూత ప్రేత పిశాచములతో నెట్లుపోరాడగలవు? ఊరక డంబములు సెప్పకుము.

బృహ: డంబములు కావు; ఇందు భూత ప్రేత పిశాచములుండజాలవు.

ఉ. కు: ఎందువలన.

బృహ: ఇది దివ్యవృక్షము.

ఉ. కు: (ఆశ్చర్యముతో) దివ్యవృక్షమా? అయిన నిందు దేవతలుందురా?

బృహ: దేవతలు గాదు; దివ్యములగు నాయుధములిందున్నవి.

ఉ. కు: ఆయుధములా? (గంభీరముగ) ఆ ఆయుధము లెవరివి? మాకు తెలియకుండ, మా రాజ్యమునందున్న వృక్షముపై ఆయుధములుంచుటకు వారికెవ్వరధికారమిచ్చిరి. చెప్పుము.

బృహ : తొందరపడకు యువరాజా!

ఉ. కు: తొందరయే; తొందరకాక మరేమి? వారు మా శత్రువులు కాగూడదా ?

బృహ; వారు మీకు శత్రువులుకారు. పరమ మిత్రులు.

ఉ. కు: పరమ మిత్రులా? ఎవరువారు?

బృహ: పంచపాండవులు.

ఉ. కు: (తృళ్ళిపడి) బృహన్నలా! ఏమంటివి? పాండవులా? పంచపాండవులా? (మృదులముగ) బృహన్నలా! నీవు పాండవులిప్పు డెందున్నారో ఎరుగుదువా?

బృహ: ఎరుగకేమి? చక్కగా నెరుగుదును.

ఉ. కు: (ఆతురతతో) ఎందున్నారు! అలసింపక చెప్పుము.

బృహ: తరువాత చెప్పెదను. ముందావృక్షము నారోహించి, ఆయుధముల దీయుము.

ఉ.కు: (మొండిగా) నేను వృక్షమెక్కను. ఆయుధములసలే తీయను. బృహన్నలా! నీకెంత గుండెనిబ్బరము. బలవద్విపు భయంకరులగు పాండవుల ఆయుధములనే అపహరింప నెంతువా? ఆ చెడుపనికి నన్ను సాహాయ్యము సేయుమందువా? నే వారికేమౌదునో నీకు తెలిసినట్లులేదు. తెలియకున్నను నిప్పుడు తెలిసికొనుట మంచిది. అమ్మహానుభావులకు నేను మేనల్లుడను. ఇప్పుడేమందువు?

బృహ: (నవ్వుచు) ఏమందును? 'యువరాజా! ఇప్పటికే చాల జాగు చేసితిమి. ఇక నాలసింప జనదు. ఆయుధముల( దీసి యిమ్ము' అని యందును.

ఉ కు: (సవిచారముగ బృహన్నలవంక(జూచి) బృహన్నలా! నీ వెద్దియో రహస్యమును దాచుచున్నావు. నీకుపాండవుల యునికి తెలియును గదా! వారెక్కడ నున్నారో త్వరితముగ( జెప్పుము. నీ వెంత త్వరితగతిని చెప్పిన నేనంతత్వరితగతిని, వృక్షము నారోహించి, ఆయుధముల నీకిత్తును. లేకున్న నేనిందుండి కదలనే కదలను.

బృహ: రాకుమారా! నీ మొండిపట్టుదల విడువవా?

శ్రీ. కు: విడువను: విడువను: విడువను: నరా ఇ(క(జెప్పుము.

బృహ: (నిట్టూర్చి) పాండవు లెందో కాదు మన వీటనే యున్నారు.

శ్రీ. (ఆత్రముతో) మనవీటనే ఉన్నారా? ఎవరువారు? డొంక తిరుగుడు మాటలు మాని త్వరగా( జెప్పుము. ఆమ్మ హనీయులగూర్చి తెలిసికొన నా మనసు పరవశ్య త్రొక్కుచున్నది.

బృహ: నీ జనకునికడ, కంకభట్టారకు(డను పేర వర్తించు మహాపురుషు(డే ధర్మనందను(డు.

శ్రీ. కు: ఉండుముండుము కంకుభట్టు ధర్మనందను(డా? (ఆలోచించి) ఇది నమ్మదగియే యున్నది. ఆ ము ఖ వర్చస్సు, గాంభీర్యము, రూపసంపద, ఇతఁడు మహా పురుషు(డని చెప్పక చెప్పుచుండును. ఆత(డొక రాజన్యశేఖరు( డనియు(, గాఢాంతరమున నిట్లు సన్యాసి వేషమును ధరించి సంచరించుచున్నాడనియు. నేను సందేహించుచునే యుంటిని నా సందేహమే నిజమైనది. సరే, ఒకరైరి, ఇ(క రెండవవారు.

బృహ: మీయింట వంటలవా(డై మెల(గుచున్న వలలు(డే, నాగాయుత బలు(డగు భీమసేను(డు.

శ్రీ. కు: ఏమేమి? వలలు(డే భీమసేను(డా? ఆశ్చర్యకరముగ నున్నదే (ఆలోచించి) లేదులేదు; ఇందాశ్చర్యకరమగు

విషయమేలేదు. మామీద నెవ్వరో మత్తుమందుజల్లిరి. లేకున్న ఆఁకొన్న సింహశార్దూలాది క్రూరజంతువుల తోఁబోరి, తలపువ్వు వాడకుండ నిలువగల బలశాలి యెవ్వడుండును? అంగీకరించితిని; వలలుడే భీమసేనుఁడు, ఇద్దరైరి, ఇఁక మూఁడవారు, వారేముఖ్యాతిముఖ్యులు; పాండవమధ్యములు అర్జున నామధేయులు. వారెవ్వరు?

బృహ: దామగ్రంథి యనుపేర నశ్వశిక్షకుఁడై మిమ్మాశ్రయించియున్న సుందరాకారుఁడే నకులుఁడు; తంత్రీపాల నామమున గోసంరక్షకుఁడైయున్న మనోజ్ఞరూపుఁడే సహదేవుఁడు

ఉ. కు: వారు జగదేక సుందరులే: సందియములేదు. అట్టి రూపసంపద మరెవ్వరికుండును, వారు నిశ్చయముగ నకుల సహదేవులే యగుదురు. ఇఁక అర్జునునిమాట?

బృహ: మాలిని యనపేర, సైరంధ్రీరూపమున నంతపురమ్మున సంచరించు నంగనయే ద్రౌపది.

ఉ. కు: (త్రుళ్ళిపడి) ఆఁ ఏమంటివి? సైరంధ్రియే ద్రౌపదియా? (ముక్కుపై వ్రేలుంచుకొని) ఎంతపొరపాటు? ఎంతటి యపరాధమును మేమొనర్చితిమి?

బృహ: ఆమెకు మీరుచేసిన యపరాధమేమున్నది?

ఉ. కు: అపరాధముగాదా! రాజసూయాధ్వర ప్రవర్తకులగు పాండవుల పట్టమహిషిచేఁ బరిచర్యలు చేయించుకొను

టయా? ఇది మహాపరాధము. బృహన్నలా! ఆసాధ్వీ మతల్లి పాదపద్మములకు నమస్కరించి, మా యపరాధములను సైరింపుమని మేము వేడుకొనదలచినాము. నగరమున కేగినంతనే విజయోత్సాహములో మేమది మరువవచ్చును. జాగరూకుఁడవై యుండి నీవది మాకు జ్ఞప్తికిఁ దేవలయును. తెలిసినదా?

బృహ: తెలిసినది యువరాజా! కాని.

ఉ.కు; మా మాట కెదురాడకుము. అదియట్లు జరుగవలసినదే. (ఆలోచించి) ఎంతటి బుద్ధిమాంద్యము. అప్పుడే గ్రహింపవలసినది. సైరంధ్రి వచ్చినపుడే తన కేవురు భర్తలు గలరనియు. వారు జగదేకవీరులగు గంధర్వులనియుఁ జెప్పినది. ఆ గంధర్వులే పంచ పాండవులు—కాదు—పంచపాండవులే ఆగంధర్వులు, ఏమందువు! నిజమా? కాదా?

బృహ: నిజమే అందులకే—

ఉ. కు; ఉండుము ఉండుము. నీవుచెప్పవలదు. నేనే యంతయు నూహించి చెప్పగలను.

బృహ: ఇఁక నూహించుటకేమున్నది?

ఉ. కు: చాలగలదు. నీ వూరకుండుము. నా బుద్ధి యిప్పుడు చాల తీక్షణముగాఁ బనిసేయుచున్నది సర్వాలోచించుకొననిమ్ము. (నిమీలిత నేత్రుఁడై) ఆఁ ఇప్పుడు తెలిసినది.

బృహ: ఏమి తెలిసినది ?

ఉ, కు: కీచకు నెవ్వరు చంపిరో తెలిసినది.

బృహ: పంచపాండవులే గంధర్వులని నిష్కృష్టముగఁదేలి నపు డిఁక కీచకసంహర్త నెరుంగుట కంత కష్టమే మున్నది?

ఉ. కు; అక్కడనే నీవు పొరపడుచున్నావు. పాండవులందరు నేకమై సింహబలుని సంహరించి రందువా?

బృహ: నేనేమియు ననలేదు.

ఉ కు: ఆఁ! అందులకే నేనుచెప్పుచున్నాను. వినుము. పాండవులలో సింహబలుని చంపగల బలపరాక్రమములు భీమార్జునులకుమాత్రమే కలవు. (అర్జునుఁడేదియోచెప్పబోవగా) అప్పుడే హంసపాదు పెట్టకుము. తక్కిన వారికి కూడ బలపరాక్రమములుండిన నుండవచ్చును. కాని అవకాశము మాత్రము లేదు రాజమందిరములు వాని కట్టుదిట్టములును నీకు సరిగాఁ దెలియవు.

బృహ: కన్నియల కాటకిరవు నాకు రాజ ప్రాసాదములందుండు నియమము లెట్లు తెలియగలవు?

ఉ. కు: నిజమే. నీ యీ అజ్ఞత దోషమెంతమాత్రమునుగాదు. కాని నేను రాకుమారుఁడను అందును యువరాజును. నాకుఁ దెలియనిదేమున్నది ? అది యటుండనిమ్ము. కంకుభట్టారకుఁ డుండు భవనము రాచనగరు నడుమ

గలదు. అందఱ ప్రవృత్తులై రేయింబవలు సాయుధులగు భటులు కావలి గాయుచుందురు. వారికిఁ దెలియకుండ నాతఁ డీవలకు రాజాలఁడు. అట్లే అశ్వశాలయు గోశాలయు వీరభట పరిరక్షితములై యుండును. భటుల కెరుకగాకుండఁ గవలీవలకు రాజాలరు. మహానస గృహమునకుఁ గావలియుండదు. కావున భీమసేనుఁడు సింహబలుని జంపుట కవకాశమున్నది. ఇఁక పార్థుఁడు—ఆ మహాపురుషుఁడెచ్చట నెట్లున్నాఁడో నీవు చెప్పనేలేదు, చెప్పినచో, నాతని కవకాశమున్నదియు లేనిదియు నేను నిర్ణయించి చెప్పగలను.

బృహ: సింహబలుని జంపు నవకాశము పార్థునకులేదు.

ఉ.కు: ఏల?

బృహ: తక్కిన పాండవులవలె పార్థుఁడు వేషాంతరమును మాత్రమే పరిగ్రహింపలేదు. రూపాంతరమును గూడ బొందియున్నాడు.

ఉ. కు: రూపాంతర మనగా?

బృహ: ఊర్వశీశాపవశమునఁ బేడియై సంచరించుచున్నాఁడు.

ఉ. కు: పేడియా? మనవీట నెవ్వరున్నారు? ఉన్నచో ఆ తేజస్వి (బృహన్నలను దేరిపారఁజూచి) బృహన్నలా! నీవు....నీవు ...

బృహ: (చిరునవ్వుతో) ఔను. నేనే,— ఇఁక— దాపనేల?—
నేనే అర్జునుఁడను.

రా. కు: (మహానందముతో) ఆహా! ఎంతకాలమునకు నా
చిరకాలవాంఛిత మీడేరినది. (అర్జునునకు సాష్టాంగ
దండప్రణామముచేసి, లేచి, చేతులు జోడించి) మహా
పురుషా! ధన షడ్గ్రణీ! సురాసురుల కజేయుఁడవైన
నిన్ను గాంచినంతనే, నా హృదయము, పెన్నిధిగన్న
పేద చందమున నుప్పొంగిపోవుచున్నది. నా జన్మ
నేటికి సార్థకమైనది. నేను ధన్యుఁడనైతిని. ఇంక
నీ యిచ్ఛవచ్చిన కార్యమున నన్ను నియోగింపుము.

దివ్యతేజో విరాజిత దేహమొప్ప
భాగ్యదేవత దా నేత్రపర్వముగను
గానవచ్చుటగాదె, యఖర్వశౌర్య
ఖనివి నీ విటు నా ముందు గానఁబడుట.

నీ యాజ్ఞ నిర్వర్తించి, నీ మెప్పువడసెదను.

(వృక్షమునెక్కఁబోవును)

బృహ: రాకుమారా!

రా. కు: రాకుమారా అని నన్ను బిలువవలదు. 'కుమారా'
అనుము.

బృహ: సరే అట్లే పిలిచెదను గాని, ముందాజమ్మికి నమస్క
రింపుము, తరువాత దాని నారోహింపుము, అందు
న్నవి దివ్యాయుధములు.

(ఉత్తరుఁడు జమ్మికి నమస్కరించుచు. చెట్టెక్కి)

ఉ. కు: బృహన్నలా! కాదుకాదు: అర్జునా! మోసముజరిగి పోయినది, పెద్ద మోసము.

బృహ: ఏమా మోసము.

ఉ. కు: ఇందాయుధము లున్నవను పేరాసతో నీ విటకు వచ్చితివి, కాని నీయాస లడియాసలే యైనవి.

బృహ: ఎట్లు?

ఉ. కు: ఆయుధముల నెవ్వరో దొంగ లపహరించుకొని పోయిరి, వానికి బదులుగా నొక పీనుగునుంచిరి, కావలసిన నీవిటకు వచ్చి చూడుము.

బృహ: (నవ్వి) చూడనక్కరలేదు. అది పీనుగుగాదు. తమ యాయుధముల నొరులెవ్వరు నపహరింప కుండుటకై పాండుకుమారులా రూపమునఁ దమ శస్త్రాస్త్రముల నందు భద్రపరచి యున్నారు. వెరగందక వానిని గైకొని రమ్ము.

ఉ. కు: (వానిదగ్గరకేగి, ముట్టుకొనబోయి, భయముతో) సారధీ—పొరపాటు—అర్జునా!

బృహ: మరలనేమి వచ్చినది?

ఉ. కు: ఏమి వచ్చినదా? నా ప్రాణముల మీదికే వచ్చినది. అవి ఆయుధములు కావయ్యా! ఆశీవిషములు.

బృహ: వానికి భక్తిపూర్వకముగ నమస్కరింపుము. అప్పు డవి వాని నిజరూపమున సాక్షాత్కరించును.

(ఉత్తరుఁడు వానికి నమస్కరించును)

ఉ. కు: మహావీరా! పెను కొండచిలువ చాడ్పున భయదం బయ్యుఁ గనత్కనక కమల సుందరమగు నీ మహ నీయ చాపము గాండీవమా!

బృహ: అదియే గాండీవము, దానిని గైకొనుము. దానికడనే అక్షయతూణీరమును, మదీయ తను త్రాణ శిరస్త్రాణ ములు నున్నవి. వానిని గూడ దీసికొని, మరలయథా ప్రకారముగ నయ్యాయుధముల గట్టివేసి రమ్ము.

ఉ. కు: మహాభాగా! భీషణమగు నీ చాపము నీ కెట్లులభించి నది. ఇది దివ్యమని విందుము.

అర్జు: కుమారా! ఇమ్మహనీయ చాపమును బ్రహ్మశతసహస్ర వర్షములును, ప్రజాపతి చతుష్షష్టి సహస్రవర్షములును అమరాధిపుఁడు పంచాశీతి హాయనములును, సోముఁడు పంచ శతాబ్దములును, వరుణుఁడు శతశరత్సమితియుఁ గ్రమముగా ధరించిరి. అగ్నిదేవుఁడీ ధనువునెడ మక్కువపడి వరుణు నడిగి పుచ్చుకొనెను. ఖాండవ దహనానంతరము నా యెడఁ బ్రీతుఁడై దీనిని నా కొసంగెను. ఈ దివ్యచాపము నాకడనరువదేనేండ్లుండును,

ఉ. కు: ఇచ్చట మరికొన్ని యాయుధములున్నవి. అవియు ననుపమాన తేజోవిరాజితములై యొప్పారుచున్నవి. పాండవులలో నెవ్వరేయాయుధమును ధరింతురో, విన కుతూహలముగ నున్నది.

అరు : అంతటి కుతూహలమే నీకున్నయెడల, నేనేలకాదన వలయును? విడమరచి చెప్పుచున్నాను. సావధానముగ వినుము

నల్లకల్వల చాయ నుల్లసిల్లుచు హేమ
  వృషపాళి నెంతయు వెలయు ధనువు(
దాళప్రమాణమై తపనీయ శాఖా మృ
  గాంచితమ్మైన శరాసనంబు
ననలసన్నిభమైన ఘనకాంతులీనుచు(
  గనకమత్స్యముల సొంపెనయు విల్లు(
జారు ప్రభాపూర్ణ శాతకుంభమయూర
  భాసురంబైన బాణాసనంబు(
బాండుతనయాగ్రజుండును బవనసుతుడు
నకుల సహదేవులును నరనాథపుత్రి!
క్రమముగా దాల్తు రీ దివ్యకార్ముకములు
ఘోర రిపు వీర సంత్రాస కారకములు.
ఉద్దవిడి నన్ని దెసలును
దద్దయు( దనదీప్తులొరయ( దపనద్యుతిన
య్యుద్దండ గదాదండము
నొద్దిక భీముడు ధరించు నుగ్రరణములన్.

కుమారా! నీకుతుకము తీరినదికదా! ఇఁక గాండీవా ద్యాయుధములఁ గైకొని నీవు క్రిందకు రమ్ము. (ఉత్తరుఁడు క్రిందకు దిగి అర్జునున కాయుధము నొసంగును. అర్జునుఁ డయ్యాయుధములకు నమస్కరించి గైకొని ధ్యాన స్తిమిత లోచనుఁడగును)

... తెర ....

ద్వితీయరంగము

అర్జునుఁడు ఉత్తరుఁడును బ్రవేశింతురు. అర్జునుఁడు, పేడిరూపమును వీడి, మహోజ్వల యోధవేషమున నుండును. అతని శిరస్సుపై మహేంద్రుఁ డిచ్చిన కిరీటము తళత్తళల నీనుచుండును. భుజమున గాండీవ మమరియుండును )

ఉ. కు: ఎంత యాశ్చర్యము! నీవు ధ్యానముద్రయందుండఁగా నేను చూచుచుండగనే, నీ రూపమంతయు మారి పోయినదే. అనర్ఘ మణి గణోజ్జ్వలమగు నీ కిరీటము, నీ తలపైఁ దనంతదానే మొలచినట్లు నా కన్నులకు, భాసించినది. వీరాగ్రగణ్యా! వైరిజన భయంకరమును సాధుజన శివంకరమును, సుహృజ్జన నయనానంద కరమునగు, నీ దివ్యమూర్తిని సందర్శించి నేను చరితార్థుఁడనైతిని. రథచోదకత్వమున నీమెప్పునంద వలెనను గాఢవాంఛ నాకుఁ జిరకాలమునుండియు

గలదు. ఆ వాంఛ యీ నాటి కీడేరినది. నిన్నెరుంగక నా పల్కిన ప్రల్లదములను, దయామతి సైరింప వేడుకొనుచున్నాను.

అర్జు: (ఉత్తరుని కౌగలించుకొని) కుమారా! నీవునన్నింతగా వేడుకొననేల? నీవు నాయెడఁ గావించిన యపరాధము లెవ్వియును లేవు. చేయని యపరాధములకు నన్ను క్షమాభిక్ష వేడుకొనవలసిన పని నీ కంతకంటెను లేదు. నీవు నాకత్యంతము ప్రీతిపాత్రుఁడవు. అశ్వ చోదనము గావించునెడ గాలిఁగూడ నీపై సోకకుండ రక్షించెదను. కురుసేన నెదుర్కొందము రమ్ము. రథమారోహింతము.

(ఇర్వురును రథముకడ కేగుదురు. కిరీటి రథికుఁడై కూర్చుండగా, ఉత్తరుఁడు సారథియై తేరు నడుపుట నభినయించును.)

ఉ. కు: మహావీరా! కురుసేనలోఁ బేరెన్నికఁ గన్న వీరులను నే నెన్నడును జూడలేదు. ప్రళయభైరవ సహస్ర గర్జనోదగ్రతర్జనుఁడగు నర్జునుని సంగర రంగమున నెదుర్కొన సాహసించు నవ్వీరుల గూర్చి తెలిసి కొన మనసగుచున్నది.

బృహ: కుమారా! కురుసేనలలో ననితరసాధారణ చిత్ర విచిత్ర ఖండనపాండితీ ప్రచండులగు వీరవరులనే కులు గలరు. వారిని గూర్చి నీవవశ్యముఁ దెలిసికొన వలసియున్నది. ప్రసన్నచిత్తుఁడవై నా చెప్పునది వినుము, కాంచనమయవేదికా ధ్వజ సముల్లసితమగు

నరదమ్ము నధివసించి యున్న మహనీయుడేఁ ద్రోణుఁడు. సింహలాంగూల కేతు విరాజితమగు రథము నధిరోహించియున్న తేజస్వియే అశ్వత్థామ. కనక గోవృష కేతన సమన్వితమగు తేరుపై నాసీనుఁడై యున్న వర్చస్వియే కృపుఁడు కంబుపతాకా భాసురమగు స్యందనమున నధిష్ఠించియున్న శూరాగ్రేసరుఁడే రాధాత్మజుఁడు. 'మణిమయోరగ రుచిజాల మహితమైన పడగవాఁడు కురుక్షితిపతి'. మహోగ్రమగు తాళధ్వజముతో విరాజిల్లు మహనీయస్యందనము నధివసించియున్న జగజెట్టి వీరుఁడే దివ్యాపగానందనుఁడు. వీరందరును గురుసేనలోఁ బేరెన్నికగన్న బిరుదుమగలు. వీరాధివీరులు. వీరిలోఁ గొందరు మనకు పరమ పూజ్యులు. అస్మహనీయులతోఁ గయ్యమునకుఁ గాలు ద్రువ్వుట మనకు శ్రేయస్కరము గాదు.

ఉ. కు; వారెవ్వరో ముందు వివరింపుము.

అర్జు: కుమారా! వేదికాధ్వజ విరాజితమ్మగు రథమును, అందుఁ గూర్చుండియున్న యలఘు తేజోమూర్తిని జూచితివా? ఆతఁడే అస్మదాచార్యుఁడు ద్రోణుఁడు.

సురగురుతుల్యుఁడు మామక
గురునకు నవమానంబెపుడు గోరందగ ద
ప్పరమోదారుని కృపచే
వరుదగు దివ్యాస్త్రలాభ మందితి ననఘా!

దుర్జయుఁ డీతఁడు రణమునఁ
బర్జన్యుని భంగినేయు బహుశరములఁద
ద్గర్జన్నిశితాశుగముఖ
జర్జరితములగుచు వైరి సైన్యములడలున్.

కావున, ఇమ్మాహామహునకుఁ బ్రదక్షిణముగ మనయ రదమ్మును బోనిమ్ము. మాయాదురోదరమ్మున మమ్మోడించి, అవాచ్యములగు నవమానముల పాల్జేసిన దురాత్ముఁడగు దుర్యోధను బరిమార్చి నే నేగు నప్పుడీతఁడు నాపై నిశితశరము నిగిడించునో, నిగిడింపఁడో చూతము. ముందాతఁడే యుద్ధమునకు సిద్ధపడిన మనముగూడ సిద్ధమగుదము.

శ్రీ. కృ: ఆచార్యుఁడు సర్వజనవంద్యుఁడే. దుర్మదుఁడగు దుర్యోధనునితోఁ గూడి దుర్యశమును సంపాదించు కొనుచున్నాఁడని నా నిశ్చితాభిప్రాయము.

అర్జు: కుంభసంభవుఁడు నీతిశాస్త్రకోవిదుఁడు; కార్యాకార్యజ్ఞుఁడు,

శ్రీ. కృ: అట్లే యూహించుకొని మనము సమాధానపడుట యుక్తము.

అర్జు: ఇది యూహకాదు, సర్వథా సత్యము

శ్రీ. కృ: కావచ్చును. ఎవరియభిప్రాయములు వారివి. దుర్యోధనునిదే ధర్మపక్షమనియు నందులకే ధర్మవిదులగు

ద్రోణభీష్మాదు లాతనికే సాహాయ్యమొనరించిరనియు, రేపు కొందరనవచ్చును.

అర్జు: ఉత్తరా నీవీనాఁడు పుట్టవలసిన వాఁడవు కావు.

ఉ. కు: ఎందుచేత.

అర్జు: ధర్మము నధర్మముగను, అధర్మము ధర్మముగను జూపుశక్తి యీ యుగమునఁ బుట్టినవారికుండదు.

ఉ. కు: ధర్మాధర్మములను దారుమారు చేయుటకు దగినయవకాశమును ద్రోణ భీష్మలే కల్పించుచున్నారు.

అర్జు: ( తీవ్రముగ ) ఉత్తర కుమారా! పూజ్యగర్హణ నింద్యము.

ఉ. కు: అదిగో! నీకు కోపము వచ్చినట్లున్నది. నాకేల యీ యధిక ప్రసంగము? సరే. గురునకుఁ బ్రదక్షిణముగనే రథమును ద్రిప్పుదును. ఇంకేమి సేయవలయును.

అర్జు: ఇఁక గురుపుత్రుడున్నాఁడు. ఆతని గుర్తించితివా?

ఉ. కు: గుర్తింపకేమి? బాగుగా గుర్తించితిని. ఆ సింహ లాంగూల ధ్వజముకల తేజస్వియే కదా!

(తేజస్వి అనుమాటలు నొక్కిపలుకును)

అర్జు: (ఆ హేళనను గ్రహించియు గ్రహింపనట్లే)

అస్మదాచార్యునకువోలె నతని సుతుఁడు
మనకు మాన్యుండు; సంగర మధ్యమందు
నతని నోర్వ సురాసురులైనఁ జాల
రమల తేజోవిరాజితుఁ డనఘుఁ డతడు.

ఆర్యుఁడు మత్పితృ సఖుఁడా
చార్యక మొనరించె మాకు శైశవమున; దో
ర్వీర్యజిత శత్రుభూభృ
ద్వర్యుఁడు కృపుఁ డితఁడు వంద్యుఁడు మనకున్.

వీరితో మనమిప్పుడు కయ్యమునకుఁ గాలు ద్రవ్వఁ బనిలేదు. ఎచ్చోటనైన వీరు మన కెదురైనచో మన రథము నల్లనల్లనఁ బోనిమ్ము.

ఉ. కు: తప్పక అట్లే చేసెదను. ప్రక్కకు దప్పికొనుట యనిన నాకుఁ బరమానందమే.

అర్జు: మనకుఁ బరమపూజ్యుఁడగు మహనీయుఁ డీ సెనలో నిక నొక్కరుఁడే యున్నాఁడు.

ఉ. కు: అది స్పష్టమే. ముంజేతి కంకణమున కద్దమేల?

అర్జు: (చిరునగవుతో) ఎవరో చెప్పుము? చూతము నీ బుద్ధి కుశలత.

ఉ. కు: తేటబియ్యము, పాటిమానిక. ఇందుఁ జెప్పుటకే మున్నది? భీష్ముఁడు.

అర్జు: ఉత్తరా! నీ తెలివితేటలమోఘములు.

ఉ. కు: మా తలిదండ్రులేనాడో నిర్ణయించిన విషయమది.

అర్జు: నీకు బాల్యచాపల్యము పోలేదు.

ఉ. కు: ఇది నీ నిర్ణయమా ?

అర్జు: ఔను, నీ వొక్కొక్కప్పు డొక్కొక్క విధముగ మాటాడుచుందువు. ఒకప్పుడు దంభము, ఒకప్పుడు బేలతనము, ఒకప్పుడు ధార్ష్ట్యము. ఒకప్పుడు వినయము నీ మాటలలో ధ్వనించును. నీకు పెద్దలయెడ గౌరవము లేదా?

ఉ కు: ఎట్లుండును? నా తల్లిదండ్రులు నాకెన్నడు నది నేర్పనిదే. అందరు నన్ను మన్నించి యాకసమున కెత్తువారే జనకుఁడు నిండుకొలువులో నాబలపరాక్రమముల నగ్గడించును. జనని, పొగడ్తలకు సమయాసమయములే లేవు, మా రాజ్యమున నా యెడఁ కువకుఁ బాత్రులగువారు వారిర్వురుకదా! వారే, నన్ను బెద్దఁ జేసి పల్కుచుండ నిక నే నెవ్వరిని గౌరవింపవలయును, ఇఁక దక్కినది చెప్పనేల? 'యథారాజా తథాప్రజాః' అను లోకోక్తి యున్నదేకదా! ఇఁక నాకు పెద్దలెవ్వరో వారినెట్లు గౌరవింపవలెనో యెట్లు తెలియగలదు.

అర్జు: నన్నుగూర్చి నిజమెరిగినంతనే. నీవు ప్రవర్తించిన విధము (అర్ధోక్తి)

ఉ. కు: అదా! చిన్ననాటినుండియు, నీవు నాకాదర్శపురుషుఁడవు. నీ వీరవిహార కథాశ్రవణము నానిత్యకృత్యములలో నొకటి. అందులకే నిన్ను దెలిసికొనినప్పుడు నా హృదయము భక్తిభావనిర్భరతఁ బరవశమైనది. అట్టి భక్తి–అది భక్తియను. గౌరవమను–నీయెడ నాకెప్పుడును గలదు. ఇతరులను గౌరవించుట నేనింక నేర్చుకొనవలసి యున్నది

అర్జు: ఆపని నీవు చేయుచున్నట్లు లేదు.

ఉ. కు: బాగున్నది నీ మాట. ఇప్పటికిప్పుడే చిరతరాభ్యాన వశమున వచ్చినగుణ మెట్లుమారును? నా విషయమటుండనిమ్ము. భీష్మునియెడ మనమెట్లు ప్రవర్తింపవలెనో చెప్పుము.

అర్జు: ఆలమందలు మన యధీనమునకు వచ్చు వరకును మనము పితామహున కెదురుపడరాదు.

ఇరువదియొక్క మారు ధరణీశులఁ
జంపిన జామదగ్న్యుని
ఘ్ఠశరధాటి నోర్చిన విశుద్ధయశుండదె
భీష్ముఁడొప్పు, నా

సురసరిదాత్మజున్ రిపునిషూదను
డాయగరాదు; డాసినన్
గురుపతిఁ జేరనీక పెనగున్ దరిఁ
జేరగనీయఁడెంతకున్.

మన ప్రథమకర్తవ్య మాలమందలను విడిపించుట, ద్వితీయ కర్తవ్యము దర్పాంధుఁడగు సుయోధను బరాభవించుట. ప్రప్రథమముగ భీష్మునితో దలపడిన నీ రెండుకార్యములును జెడును. కావున నీతనిపొంతకు మన రథమును బోనీయకుము.

ఉ. కు; తనంతటఁ దానే మనకెదురువచ్చిన—

అర్జు: అప్పుడు వెనుకంజ వేయవలసిన పనిలేదు,

ఉ. కు: ఆతని జూచిన నీకు భయమనుకొంటిని.

అర్జు ; ఉత్తరా! నీకు బాల్యచాపల్యమేకాక మనశ్చాంచల్యము కూడ నున్నదే.

ఉ. కు: నీదయవలన మనశ్చాంచల్యము రాలేదు. దానికేమిగాని, చెప్పవలసినది చెప్పుము.

అర్జు : కంబుధ్వజమును జూచితివా?

ఉ. కు: కంబుధ్వజమునేకాదు, కర్ణునిగూడఁ జూచితిని.

అర్జు : బాగుగ నవలోకింపుము.

యోధాగ్రేసరుఁ డుద్ధత
భూధవనిర్మథన జాత భూరిప్రథ దు
ర్యోధను మన్ననలందెడు
రాధేయుండొప్పు నుదయ రవితేజమునన్.
పరశురాముని శిష్యుండు భండనమున;
దివ్యశస్త్రాస్త్ర తేజః ప్రదీపితుండు;
శౌర్యధైర్య పరాక్రమ సాహసముల
నాకు నీతండ నరియని నమ్ము రాజ.

కావున నీతఁ డెదురైనప్పుడు, జంకుగొంకులువీడి మన రథమ్ము నాతని కెదురుగఁ బోనిమ్ము. నాయెడ మాత్సర్యంబును బ్రతిభటత్వము నీతఁడు జిరకాలము నుండి వహించుచుండును. నన్నుఁ గని యీతఁడు నిలుచువాఁడు కాఁడు. నేను నీతనిపైఁ జిచ్చురపిడు గట్లు పోయి పడుదును. సాయకోద్ధతిఁ బ్రకటించుచో, మాయిద్దరి తారతమ్యమును, నీవు నిర్మల మనస్కుఁడవై నిష్పాక్షికముగఁ బరిశీలించి తెలిసికొనుము.

ఉ. కు : అందరినిగూర్చి చెప్పితివి కాని యసలువానినే మరచితివి.

అర్జు : ఆతనినీ మరతునా? ఎంతమాట.

మానధనుం డజయ్యబలమండితు
దుర్గగదాప్రయోగ వి
ద్యానిధి, చారచక్షు వతిదారుణ
దుస్సహపాపచింత నా
ధీనమనస్కు డుద్ధతు(డు, తెంపరి.
పాండుకుమారవైరి, య
మ్మానవనాథునిందోదరి మార్కొన(
బందువునాకు నుత్తరా!

ఆతని మన్నిశిత శర
వ్రాతంబున నొదలు తూంట్లువడ నేసెద; దు
ర్వ్యాతం బియ్యదికాదని
యాతని చేతమ్ము నొవ్వనాడెద నెలమిన్.

కావున నా మదాంధుని తేరుకడకు మన యరదమ్ము(
బోనిమ్ము. సురాసురు లాతనికి బాసటయై నిలిచినను
భయమందవలదు. మెరపు మెరసిన భంగిని దరియ(
బడుము,

ఉ. కు : ఇప్పుడు నీలో నిజమగు విజయోత్సాహమును జూచు
చున్నాను.

అర్జు ; ఉత్సాహమెప్పుడు నున్నదే, తత్ప్రదర్శనమునకు(
దగిన సమయము మాత్రమిప్పుడే వచ్చినది. దానిమాట
కేమి? మన తేరు కురుసేన కెదురుగ( బోనిమ్ము.
(నిష్క్రమింతురు).

...తెర....

## చతుర్థాంకము

నాగిని భోగిని అను నాగకాంత లిర్వురు ప్రవేశింతురు.

నాగిని: ఏమే భోగినీ! భూలోకమునందలి వింతలును వినోదములును జూపుదునని నన్ను నమ్మించి యీ మహాసంగ్రామరంగమునకుఁ దీసికొని వచ్చితివేల ?

భోగి : ఇదిమాత్రము వింతకాదా? వినోదముకాదా?

నాగి : నీవెప్పుడును జగడాలమారివే, ఈ ఘోరసంగ్రామమున వింత యేమున్నది. వినోద మేమున్నది? అంతయు జగద్భయంకరమగు మారణహోమమే. ఇందు వినోదించుటకేమున్నది ?

భోగి: చాల ఉన్నది. ఉన్నది కావుననే నిన్నిటకుఁ దెచ్చితిని.

నాగి; ఏమున్నది ?

భోగి: అర్జునుఁ డెవరు ?

నాగి: ఏమే నీ ప్రశ్న? అర్జునుఁడు మన — — ఆఁ, అమ్మ దొంగా! అదా సంగతి.

భోగి: ఇప్పుడు తెలిసినదా? అర్జునుఁడు మన ప్రభుపుత్రిక ఉలూచి భర్త కదా! మనమాతని వీర విహారము నామెకడ వర్ణించితిమేని, ఆమె మిగుల సంతసించును.

నాగి: సంతసించి మన కమూల్యములగు కానుక లిచ్చును.

భోగి; కానుకలిచ్చుటయే కాదు; చెలికత్తెలలో మన కగ్ర స్థానము నిచ్చుము.

నాగి; ఎంత గడసరివే! అదిసరేకాని, మనము వర్ణించిచెప్పగా విని సంతసింపనేల? ఉలూచియే స్వయముగా వచ్చి, తన విభుని, విక్రమాటోపమును దిలకింపవచ్చును గదా !

భోగి: అజ్ఞాతవాసదీక్ష పూర్తియగువరకు ఆమె తన్ను జూడఁగూడదని అర్జునుని యాదేశము.

నాగి: ఇప్పుడు పూర్తియైనదికదా! కాకున్న నిజరూపముతో యుద్ధమునకెట్లు సిద్ధమయినట్లు ?

భోగి; అజ్ఞాతవాసకాలము సమాప్తమైన మాట నిజమే, కాని, అన్నదమ్ములందరును దీక్షా విరమణము గావింపలేదు కదా! అంతేకాదు, అర్జునుఁడుగూడ, ఈ యుద్ధ సమయమందే యీ రూపమున నుండునని నాయూహ. యుద్ధము కాఁగానే, మరల బృహన్నలా రూపమునే స్వీకరించును.

నాగి; అది నీ యూహయే కదా !

భోగి: ఊహయేకాని, ఊహింపఁదగిన ఊహ.

(తెరలో శంఖారావము)

నాగి: అబ్బ! ఆ శంఖారావమెంత భయంకరముగనున్నది? చెవులు చిల్లులు పడుననుకొంటిని. ఎవ్వరే ఆ శంఖ మును పూరించినది ?

భోగి: అదియే గ్రహింపఁజాలవా ? దిగ్దంతి కర్ణవిదళన దక్షమగు నా భీషణ నినదమింకే శంఖమునుండి జనింపఁగలదు ? అదియే దేవదత్తము. (ముందుకు చూచి) అయ్యో పాపము !

నాగి: అదేమే ?

భోగి: అటు చూడుము, ఆ భీషణ శంఖారావమునకు భయమంది, ఆ యుత్తరకుమారుఁడెట్లు నొగలిపై మూర్ఛిలినాఁడో చూడుము.

నాగి; (చూచి) ఉత్తరుఁడేకాదు. అశ్వములుఁగూడ చాప కట్టుగ భూమిఁ బడినవి. ఇట్టి భీరువు సారథ్యమెట్లు సేయఁగలఁడు? ఇవి అశ్వములా? అశ్వతరములా ?

భోగి: మహాపురుషుల కుపకరణ సామర్థ్యమువలనఁ గాక, సత్త్వసామర్థ్యము వలననే క్రియాసిద్ధి యగుచుండును గదా! మహారథికుఁడగు నర్జుననికి సాధన సామగ్రి యంతయు లాంఛనప్రాయమే.

నాగి: పాపమర్జునుఁ డాయశ్వముల వాగెలు పట్టి యెత్తి, తత్తనువులు నూలుకొనఁగ నివురుచున్నాఁడు: ఉత్తరు నదిమి పట్టుకొని, వికృతరూపమును జక్కజేసి, మనసు దేటపడునట్లు మాటాడుచున్నాఁడు—అదిగో ఆ మాట లాలింపుము.

(తెరలో)

శంఖకాహళభేర్యాది సకలవాద్య
భయదసంరావములు నీకుఁ బరిచితములె
ఇపుడుభయమందఁ గారణమేమిగలదు?
కలఁతవిడనాడి ధైర్యమ్ము నిలుపుకొనుముఁ

భోగి: ఇది కవ్వడి కంఠధ్వనమే. సందేహములేదు.

(తెరలో)

వినకేమి శంఖకాహళ
నినదమ్ములు మున్ను; భయదనిర్ఘాతమహా
ధ్వనివోలె గుండెలవిసెడు
నినదమ్మిది యోర్వనగునె నిస్తులతేజా!

నాగి: ఇవి యుత్తరుని వలుకులే; సందియములేదు కంఠ గాద్గద్యమే కదనరంగ భీరుత్వమును వ్యక్తము సేయు చున్నది.

భోగి: దేవదత్తాభిలరవమునకు నీవుమాత్రము భయచకితవు గాలేదా! ఎందుల కాతని వృథగా నిందింతువు?

నాగి: నిందించుటలేదు; సానుభూతిఁ జూపుచున్నాను.

(తెరలో మరల శంఖధ్వని; గాండీవజ్యా భయద నినాదము)

భోగి: అదిగో! అటుచూడుము. ఆఁకొన్నపంచాస్యము హరిణ శాబకములపై కురుకుచున్నది. 'రథనేమిస్వనజా'

నినాదమేదురమగు భయదశంఖారావ మొప్పఁ బార్థుఁడు భండనమునఁ బగతురఁ బరిమార్ప నేగు చున్నాఁడు.

వాగి: మింటివంకఁ జూచితివా? సురగరుడ సిద్ధచారణ గణంబులు గొల్వ సురేశ్వరుఁడు సుదర్శనమను సుందర విమానరాజము నధిరోహించి, తన ప్రియసూనుని యవక్రపరాక్రమము నవలోకింప నేతెంచియున్నాఁడు. ఆఖండలుని ప్రక్కనున్న యొక మహాసనముపై, నమరీమండలి వీచోపులిడఁగఁ బాండు మహీపాలుఁ డాసీనుఁడై యున్నాడు. స్వర్గముననున్న, రాజులును రారాజులును, నిజోచిత చామరచ్ఛత్రాది రాజలాంఛనములతో దేవరాజును గొలుచుచుఁ గదన సందర్శన కౌతుకమున గగనతలమున నిలిచియున్నారు.

భోగి: అందేమి విశేషమున్నది? అమరనాథునకు, తన యాత్మజునిపై ననురాగముండుట సమంజసమేకదా! కాని క్రిందకుఁ జూడుము. రసాతల వాసులైనరాక్షస వీరుల దృశ్యరూపములఁ గౌరవవీరుల నావేశించి యున్నారు.

వాగి: ఇది మరియు విడ్డూరముగనున్నదే. ఒక్కనితోఁ బెక్కండ్రు పోరుటయే యసమంజసము, అట్టియెడ

మనుజులును దనుజులును నేకమై యొక్కనితో నవి సేయుట లజ్జాకరము.

భోగి: ఆహా! గురుజనము నెడ బార్థుఁడు చూపు వినయవిధేయతలు సర్వజన శ్లాఘ్యములు కదా! గురు, కృప శాంతనవులకుఁ జరణసమీప స్థలముల నిలువ రెండును, కర్ణాభ్యర్ణ ప్రదేశములఁ జన రెండునుగా నాలుగేసి యమ్ములేసి యున్నాఁడు.

నాగి: ఆ బాణప్రయోగమునఁ గల విశిష్టత యెట్టిది?

భోగి: ఆ మాత్రమూహించి తెలిసికొనలేవా? పాద సమీపమున నేసిన బాణద్వయము, ప్రణామమును దెల్పును. కర్ణాభ్యర్ణ ప్రదేశమున నేగునట్లేసిన సాయకద్వయము కుశలప్రశ్నములు దెల్పును.

నాగి: అమ్మో! అవి గురితప్పిన నెంత ప్రమాదము.

భోగి: పిచ్చిదానా! సవ్యసాచి బాణము గురితప్పుటయా? సూర్యచంద్రులు తమగతులు తప్పినను అట్టిపని జరుగదు. దశరథ తనయుఁడగు రామునియందు లక్ష్యశుద్ధిగలదు. యుగపదనేక బాణప్రయోగ సామర్థ్యమున లక్ష్మణుఁ డద్వితీయుఁడు. స్థైర్యమున మహేంద్రుఁ డనుపముఁడు. లక్ష్యశుద్ధియందును, బహుబాణ ప్రయోగ వేగమునందును, సుస్థిరత్వమునందును అర్జునుండు సమానుఁడు.

వాగి: అదేమి? కౌరవ వీరులందరు నిటుండగా, వారిని జూచియుఁ జూడనట్లే, వివ్వచ్చుఁ డటుపోవుచున్నాఁడు.

భోగి: (పరికించి) మరేమియును లేదు. గోపులతోఁగూడ రారాజు ముందుఁ బోవుచున్నాఁడు. నిరామిషమగు నీ సేనతో నేమిపని యున్నదని, అర్జునుఁడు రాజునన్వేషించుచుఁ బోవుచున్నాఁడు.

వాగి: తక్కిన కౌరవయోధు లూరకుందురా?

భోగి: ఊరక యేలయుందురు? అదిగో అందరు నొక్కుమ్మడి నర్జునునిపైఁ గలియుచున్నారు చూడుము,

ఘనదంతావళయూధ బృంహితములున్
గంభీర హేషామహా
స్వనముల్ శత్రునిబర్హణోద్ధత భటా
వంధ్యప్రతాపస్ఫుర
న్నినదంబుల్ రథనేమి నిష్ఠుర రవాన్నీకంబులున్, వజ్రఘో
షణ నిర్ఘోషనిభంబులై దశదిశాచక్రంబు
లన్నిండెడిన్.

వాగి: అబ్బ! చెవులు చిల్లులుపడిపోవుచున్నవి, ప్రళయకాల విఘూర్ణమాన మహార్ణవము కరణి కురుబలము విజృం

భించుచున్నది. ఎంతటి బలపరాక్రమము లున్నను, పార్థుఁడొక్కఁడు: కురుబల మపారము. విజయమెట్లు సాధింపగలడో తెలియకున్నది. అదిగో! చతురంగ బలములు నొక్కమారే సవ్యసాచినెదుర్కొనుచున్నవి. ఎంత భయంకరమగు దృశ్యము!

భోగి: దృశ్యము భయంకరమే కాని, యిందొక్క విశేష మున్నది. అది నీవు గమనింపనేలేదు.

అసురేంద్రుపై నేగు నవనీరదము లట్లు
గంధగజేంద్ర సంఘమ్ము నడచుఁ
జటుల ఝంఝూ ప్రభంజనుని మార్కొన నేగు
నీరదమ్ముల భంగి తేరు లరుగుఁ
గుంభ సంభవు నెదుర్కొనఁ బోవునంభోధి
భంగమ్ములన వారువములు వెడలు
రఘురాము నుద్భట రణమున నెదిరించు
దితిజులగతి భటవ్రతతి గదలు
అశని సన్నిభ బాణుండు నలఘు బలుఁడు
మహితతేజుండు ఖరదైత్య మర్దనుండు
నైన పార్థున కీ బల మనఁగ నెంత ?
గడియలోపల నురుమాడ గలఁడు దీని

నాగి. ఆహా! గాండీవజ్యా నినాదమున రోదసీ కుహరమంతయు మార్మ్రోగుచున్నది. పుంఖాను పుంఖములుగ

నెగసిపడు నిశిత నారాచములు. గగన పథ
మంతయుఁ గప్పగాఁ గారుచీకట్లు గ్రమ్ముచున్నవి.
ఏమి యీ జగదేకవీరుని బాణప్రయోగ నైపుణ్యము ?

నారసము నెప్పు డీయునో నారివోసి
యెపుడు విడుచునో యెవ్వరి కెరుకకాదు
మండలీకృత కోదండ మండితుండు
విజయుఁ డుద్దతి ననిసేయు వేళయందు.

భోగి : ఈ యుగమునఁ గిరీటికి దక్క, ఇట్టి శరసంధాన నైపుణ్య మింకొకనికి లేదు. నాగినీ ! ఆ వీరవరుని యస్త్రకళా వైదగ్ధ్యము నొక్కసారి చూడుము. ఇప్పు డిప్పుడే యుద్ధ మారంభమైనదిగదా! అప్పుడే, కౌరవ సైన్య మెట్టి దుర్దశకు వచ్చినదో !

ప్రబల గాండీవ నిర్ముక్త భయదనిశిత
బాణ సంజాత శిఖిశిఖాపటల దహ్య
మానరాజన్య భటకోటి కాననుండు
వెలుఁగుచున్నాఁడు నిర్జర విభుసుతుండు.

నాగి : భోగినీ ! భోగినీ !

భోగి : ఏమే ఆ తొందర.

నాగి : ఏమా ! ఈ బాణపాత వైచిత్రిని దిలకింపుము. నేను దేవాసుర సంగ్రామములను పెక్కుమార్లు చూచి తిని. అందు గూడ నిట్టివైచిత్రిని జూడలేదు.

పదియైన దొక్క విశిఖము
పది పదులుగ నొక్క ఘోరబాణము నిగిడెన్
మదిరాక్షి ! మనము చూచెడు
నది యుద్ధమ ? యింద్రజాలమా ? చింతింపన్.

భోగి : పిచ్చిదానా! ఇది యింద్రజాలముఁ గాదు. మహేంద్ర జాలముఁ గాదు. బీభత్సుని యసాధారణ కార్ముక విద్యాచాతుర్యము. పూర్వ యుగమున, కుముద్వతీశ్వశురుఁడగు శ్రీరామచంద్రున కొక్కనికే యిట్టి నైపుణ్య ముండెడిదఁట.

వాగి : ఇది ఘోరము; మహాఘోరము:

భోగి : ఏమే ? ఏమైనది ?

వాగి : ఆ ఘోర వధ నీవు చూడలేదు, చూచినచో నింత నిబ్బరముగ మాటాడజాలవు.

భోగి : నా నిబ్బరము మాటకేమి ? నీవు చూచిన యా భయంకర దృశ్యమెట్టిది,

వాగి : అదిగో ! అటు చూడుము, ఇదియు నట్టి భయానక దృశ్యమే.

ధనువు విరుగ నింకొక్కటి
గొనబోయెడు నంతలోనె కువ్యన్నరమా
ర్గణ భిన్న మస్తకుండయి
వనితా ! యవ్వీరవరుఁడు వ్రాలెన్నేలన్.

భోగి : ఆహా ! ఇది యెంత యద్భుతావహముగ నున్నది. మహార్ణవమున మత్స్యరాజము విహరించు చందమున, క్రీడిరథము కురురాజ సైన్యమునందు యథేష్టముగ సంచరించు చున్నది. నరుభల్లముల ముందరి కాళులు ద్రెస్సిపడగా, మ్రొగ్గు జవనాశ్వములు, కరుణ మెయి రాహుతులకు శరణంబగు మనుచు మ్రొక్కు చందమున నున్నవి, తుండములు తెగియుఁ గుంభములు పగిలియు నేలగూలు మత్త వేదండములు, దివికి నిబిడాభ్రముల భంగి, పుడమికి సొంపు సంపాదించుచున్నవి. విలయకాలోద్దండ దండధర ప్రచండతయు, మధ్యందిన మార్తాండ ప్రతాపమును, దనయందుఁ దోప నర్జునుఁ డతి భయంకరాకారుఁడై యశని సదృక్షములగు తీక్ష్ణ శరముల నిగిడించు చున్నాఁడు. పులిగన్న లేళ్ళచందమునఁ గురురాజు సైనికులందరు విర్వచ్చు గాంచినంతనే భయమునఁ బరువులు బెట్టుచున్నారు.

నాగి : ఇంతటి మహాసంగ్రామమునఁ గూడ, నర్జునుని సారథి యుత్తరునకు, దలపువ్వు వాడలేదు: తదీయ రథాశ్వధ్వజము లక్షతములై యథాపూర్వముగ నున్నవి, దీనికిఁ గారణ మా గాండీవి సంగర కళానైపుణ్యమో, దైవబలమో తెలియరాకున్నది,

భోగి : ఇందు దైవబల మేమున్నదే? అతిశయిత సురాసుర ప్రభావుఁడగు నర్జునుని సంగరకళా నైపుణ్యమే. తదీయ సూతరథాశ్వధ్వజములను వజ్రకవచమై కాపాడుచున్నది.

( తెరలో )

అంగరాజా ! అంగరాజా రక్షింపుము! రక్షింపుము.

నాగి : ఇది కౌరవసైనికులు యార్తనాదమువలె నున్నది.

భోగి : పాప మా సైనికులు దవదహనముసఁ జిక్కుకొన్న లేళ్ళ చందమున దారితెన్నులు దెలియక తల్లడిల్లు చున్నారు.

( తెరలో )

ఓ కురుచమూపతులారా ! సైనికులారా ! భయపడకుఁడు: భయపడకుఁడు.

ఇటు లార్తి నొందనేటికి
చటులోగ్ర మదీయ శస్త్రజాలంబుల, ను
ద్భటవృత్తిఁ బార్థు నోర్చెద
నిటలాక్షుం డడ్డువచ్చి నిల్చిననైనన్

భోగి : ఇది కర్ణుని కంఠధ్వనియే. మహావృషభము రంకె వేయుచు బెబ్బులి కెదురేగినట్లు, క్రోధఘూర్ణిత నయనుఁడై రాధేయుఁడు పార్థు నెదుర్కొనఁ బోవు చున్నాఁడు.

వాగి : ఇరువురు ననన్య సామాన్య పరాక్రమోపేతులే, ఇరువురును దివ్యశస్త్రాస్త్ర విదులే. ఈ ద్వంద్వయుద్ధ పరిణామ మెట్లునడుచునో ?

భోగి : నీ వన్నమాట సర్వథాసత్యముగాదు. ఈ మహా పురుష లిర్వురిలో సాదృశ్య మెంతకలదో భేదమంత యున్నది.

బాహుబలమున నుద్దండ సాహసమున
సమర నిపుణత నిర్వురు సములె; కాని
నలఘు తేజమ్మునను దైవబలమునందు
నర్జునున కీడుకాదు రాధాత్మజుండు.

కావున నీ ద్వంద్వయుద్ధ పర్యవసానము నూహించుటంత కష్టతరమగు కార్యము గాదు.

( తెరలో )

నరుఁడేయు తీవ్రశరములు
పరభసమున నాటి యంగ సంధుల నొంపన్
పరువమ్ము బంటుతనమును
గరువము విడనాడి పరచెఁ గర్ణుండకటా !

వాగి : తేలిపోయినది కర్ణునిపస. కాని కర్ణుఁడు పలాయన మంత్రమును పఠించెనని చెప్పున దెవ్వరు ?

భోగి : ఇంద్రదూత కావచ్చును.

నాగి ; ఎందుల కట్లు చెప్పుచున్నాఁడు.

భోగి : ఇంద్రుని మెప్పు సంపాదించుకొనుటకు, మనము చేయుచున్న పనిగూడ నదియేకదా !

నాగి : నిజమే, భృత్యుల కదియే పరమార్థము.

భోగి ; ఏది ?

నాగి : ప్రభువుల మెప్పుగాంచుట.

భోగి : నన్ను హేళన చేయుచున్నావా ?

నాగి ! లేదు, నన్ను నేనే హేళన చేసికొనుచున్నాను.

( తెరలో )

కుంభసంభవు తేజంబు గుంటుపడియె
గురుసుతుని తూణసంపద గూలిపోయె
సురనదీ సూను డాజిని సొమ్మసిల్లె
వజ్రితనయుని మార్కొను వారె లేరు

నాగి : మరల దేవదూతయే చెప్పుచున్నట్లున్నది.

భోగి : ఇంక కురుసేనలో విశ్వచ్ఛుని మార్కొనగల వీరుఁడే లేఁడు.

( తెరలో )

సిరులుగొనఁ జూదమిదిగా
దరదము విడనాడి పోకుమా కురురాజా !
పురభిత్త్రిశూల సన్నిభ
వరశరములతోడ నాడవలయున్ బోరన్

నరనాథ ! భోగపరుఁడవు
కరిపురమున నేమికలదు ? కదలక నిలుమా
సురనారీ వరమోహన
పరిరంభ సుఖంబు నీకుఁ బ్రాప్తించు నిటన్.
శకునికై తవమ్ము సాగదు నేడింకఁ
గర్ణ దోర్బలమ్ము గావలేదు
చెనటి ! నీవు నాఁడు చేసిన చేఁతల
ఫలము ననుభవింప వలయు నిపుడు.

దుర్యోధనా ! నిలునిలు, నీలో క్షత్రియత్వము లేదా? శౌర్యసాహసము లడుగంటినవా ? కదనరంగమున వెన్నుచూపుట రాచపాడిగాదు, నిలు, నిలు.

**వాగి :** అది విభ్వచ్చుని కంఠధ్వనివలె నున్నది. పాపము ! పాండవులఁ బరాభవింప నింత దూరమువచ్చి, దుర్యోధనుఁడు తానే పరాభూతుఁడై పారిపోవుచున్నాఁడు.

**భోగి :** అదిగో ! రాజరాజును రక్షింప భీష్మ ద్రోణ కర్ణాశ్వత్థామాది మహావీరు లందరును దమ బలములఁ గూర్చుకొని, కిరీటిని మార్కొన నరుదెంచుచున్నారు.

**వాగి :** విలయకాలమున మహాసముద్రము భంగి కురుసేన విజృంభించు చున్నది. అర్జునుఁ డా సైన్యమును జించి చెండాడు చున్నాఁడు. (కొంచెమాగి) అదేమే, పెనుతుపాను వెలిసినట్లంతటి నిశ్శబ్ద మావహించినది?

(అంతటఁ గలయఁజూచి) అటుచూడు మటు చూడుము.

గాఢ నిద్రాభి ముద్రిత గాత్రులట్లు
శరశరాసన ఖడ్గాది సకలయుద్ధ
పరికరమ్ములు విడనాడి కురుబలమున
గల్గు వారెల్లరును మోహకలితులైరి.

భోగి : అర్జునుఁడు సమ్మోహనాస్త్రమును ప్రయోగించినాఁడు. దాని ప్రభావమది. ఇంద్రదైవత్వమును, సత్యనంవాదనము నగు సమ్మోహనాస్త్రము, అరాతి సైన్యదైన్య సంపాదనమున నకుంఠిత శక్తిగలది.

నాగి : అర్జునుఁ డుత్తర కుమారున కేదియో చెప్పుచున్నాఁడు.

( తెరలో )

దుర్యోధనుండును ద్రోణసూనుండును
దల ధరించిన వస్త్రములు నలుపులు;
అంగరాజు ధరించినట్టి యుష్ణీషంబు
పచ్చనియది; కుంభభవుఁడుఁ గృపుఁడు
దలకు జుట్టిన యట్టి వలువలు నిద్దంపు
వెల్లదనంబున వెలయుచుండు;
వారల కడకేగి చారుతరోష్ణీష
ములను గైకొనిరమ్ము; పొమ్ము వేగ

ముచ్చటగ వీని దన బొమ్మ పొత్తికలకు
నడిగె నుత్తర; తెచ్చెదనంటి నేను
సురనదీ సూను డియ్యత్ర మెఱుగుఁ గానఁ
దెలిసియుండును నీ వేగ వలవదటకు.

భోగి: అదిగో! ఉత్తరుఁడు రథముదిగి, రారాజు కడ కేగుచున్నాఁడు. నాగినీ! యుద్ధము ముగిసినది. విజయుఁడు విజయలక్ష్మీ సనాథుఁడై వే వెలుఁగు కరణి వెలుఁగుచున్నాఁడు. ఈ శుభవార్తను మన ప్రభుకుమారి యులూచికిఁ జెప్పెదము రమ్మ.

(ఇరువురు నిష్క్రమింతురు)

. . తెర .

# పంచమాంకము

విరటుని కొలువుకూటము: సర్వాలంకార సంశోభితమై యుండును. మంగళ తూర్య నినాదములు మాఱ్ఱోగుచుండును. వేదోక్తముగ బ్రాహ్మణు లాశీర్వదించుచుండగా, మంత్రి సామంత దండనాయక పరివృతుఁడై విరాట మహారాజు కొలువుకూటమున కేతెంచును. కంకుభట్టుకూడ వారితో వచ్చుచుండును. మహారాజు ముఖమున ఆనందోత్సాహములు వెల్లి

విరియుచుండును. కొందరు విలాసినులు రాజునకు మంగళహారతులిత్తురు. కలికితన ముట్టిపడ నభినయ పూర్వకముగ నడచివచ్చి, ఒక యన్నులమిన్న సుర భిళ చాంపేయ కుసుమదామమును, రాజు మెడలో వేయును ఒక మందయాన సుందర మల్లికా కందు కమును, నరపాలున కందిచ్చును. వికచారవింద నయన లిర్వురిరు గడల నిలిచి వీవనలు వీచుచుందురు. దన్నభినందింప వచ్చిన వారినెల్ల నాదరమేదుర దృక్కుల నవలోకించుచు, విరాటుఁడు నధిష్ఠించును. వందిమాగధులు లేచి, రాజతవేత్రముల నెత్తిపట్టుకొని మహారాజును గీర్తింతురు.

వందిమాగధులు :

చండ విక్రమ నిర్జిత శాత్రవునకు
భయద భండన పాండితీ ప్రథితమతికి
మహితరాజన్య సంస్తూయమాన విమల
చరితునకు మత్స్యవిభునకు జయము జయము.

జయము నిరంతర ధర్మ ప్రదీప్త మనీషా! జయము జయము.

జయము ప్రజాహితైక కార్యాచరణ నిష్ఠా గరిష్ఠా! జయము జయము.

(అందరు జయజయ ధ్వానములు సేయుదురు)

విర: (సభాభవనమును గలయఁజూచి) యువరాజెక్కడ?

ఒక పరిచారిక: యువరాజులు యుద్దానికి వెళ్ళేరు మహాప్రభూ!

విర : (ఆశ్చర్యముతో) ఏమేమి ? యుద్ధముననా ? ఎవరితో — —

ప. చా: దుర్యోధనునితో మహారాజా !

విర : దుర్యోధనునితోడనా: ఎందులకు, ఎప్పుడు ? ఏమి జరిగినది? సవిస్తరముగఁ జెప్పుము.

ప. చా: దుర్యోధన మహారాజు తన సేనలన్నింటితో వచ్చి, ఆలమందల్ని తోలుకుపోతూ ఉంటే, ఆవులు కాచే వాళ్ళు భయపడి, నగరానికి వచ్చి, యువరాజులకు జరిగిన సంగతి వివరించి, కదుపుల్ని రక్షించమని కోరేరు. అప్పుడు ఊళ్ళో ఎవరూ సారధి లేకపోతే, బృహన్నలని సారధిగా జేసికొని యువరాజులు యుద్ధానికి వెళ్ళేరు. గొప్ప ఉత్సాహముతో వెళ్ళేరు మహారాజా? కురువీరుల తలపాగలు, అమ్మాయిగారికి బొమ్మపొత్తికలుగా (మహారాజువైపు చూచి భయముతో) అదేం మహారాజా! అయ్యో, అయ్యో! మహారాజులకు మూర్ఛ వచ్చినట్టుంది. రండి, రండి, త్వరపడండి.

(ఒకపరిచారిక బంగరుగిండియతో శీతలోదకమును దెచ్చి మహారాజు మోముపైఁ జల్లును. అతనికి తెలివి వచ్చును.)

విర: (నలువంకలఁ జూచి దీనముగ) ఎంతపని జరిగినది. ఇప్పుడు కర్తవ్యమేమి ?

వయసునఁ బిన్న; చెప్పదగు
బాహుబలంబును లేదు శస్త్ర వి
ద్యయుఁ దెలియందు; సంగరవిధాన
మెరుంగడు; నిస్సహాయుఁడై
భయదబలప్రతాప గుణభాసురవీరని
కాయ దుస్తరం
బయిన యరాతిసైన్య నివహమ్మును
మార్కొనబోవుటొప్పునే.

అమాత్యశేఖరా! జాగు సేయక మనసైనికుల నాయత్త పరచి, యుత్తరునకు సాహాయ్యమొనరింప నంపుఁడు. మన కర్తవ్యమును మనము నిర్వహింతము. తరువాత దైవమున్నాఁడు. విధివిధానమును మనము దప్పింప లేముకదా !

కంకభట్టు : మహారాజా! ఉత్తరకుమారుఁడు నిస్సహాయుఁడై రణమున కేగెననుచింత విడనాడుఁడు. బృహన్నల సారథియై యుండగా. అతఁడు కురుబలమునేకాదు. అనిమిషకోటులనైన నవలీల జయింపఁ గలఁడు. విచారముడుగుఁడు,

విర : భట్టారకా! "విప్రవాక్యో జనార్దనః" అనికదా పెద్దల మాట. మీ యాశీర్వాద మమోఘమగుగాక. (సింహాసనముపై నుస్సురనుచుఁ జేరగిలఁబడి) అక్కటా! ఎంత కష్టము సంప్రాప్తమైనది. కురుబలముతో పోరాటమన్న సామాన్య విషయమా?

కురుసేన నొంటిమార్కొన
నరుఁడైనను, లేక, నందనందనుఁడైనన్
గరము సమర్థుఁడు: తక్కొరు
దరిగినఁ దద్విశిఖశిఖల కాహుతిగాఁడే?

మనకు ♦ ♦ ♦

(గోపాలురు ప్రవేశింతురు)

గోపా: జయము జయము మహారాజా!

విర : (ఇంచుక విసుగుతో) ఎవరుమీరు ?

గోపా: మేము గోపాలురం మహారాజా! కౌరవబలాన్ని జయించి యువరాజులు వస్తున్నారు. వారు * *

విర: (సంభ్రమాశ్చర్యములతో) ఏమేమీ! మరల నొకమారు చెప్పుడు.

గోపా: కురుబలాన్ని జయించి యువరాజులు విజయోత్సాహంతో వస్తున్నారు. మహారాజా! చిత్రమేమిటంటే అంత ఘోరయుద్ధంచేసినా, వారి ఒంటిమీద ఒక్క దెబ్బకూడా లేదు. వారేకాదు. గుఱ్ఱాలుగాని. రథం

గాని, సారథిగాని, చెక్కు చెదర్లేదంటే నమ్మండి మహారాజా.

విర: (మహానందముతో) ఈ శుభవార్తను తెచ్చినందులకు మీ కిదిగో పారితోషికము. (మెడలోని ముత్యాల హారమును దీసియిచ్చును. తరువాత ఠీవిగాఁగూర్చుండి మీసములు దువ్వుచు) అమాత్యశేఖరా! కంకుభట్టారకా! వింటివా మన చిరంజీవి విజయవార్త.

అమా: ఏలినవారూరక దిగులుపడిరి. కాని మొదటినుండియు, నాకుమాత్రము, యువరాజు విజయలక్ష్మి సనాథుఁడై వచ్చునన్న గాఢవిశ్వాసమున్నది. లోకసామాన్యమైన ఒక్క విషయము చూడుఁడు. పిడుగు చిన్నదేకాని మహోన్నతపర్వతమును భిన్నము చేయును. యువరాజు వయసున పిన్నయేకాని పిడుగు; అగ్గిపిడుగు. కురు బలమెంత యున్ననేమి? క్షణమాత్రమున తుత్తునియలగును.

విర: మరి చూచెదరేల ?

కరియూథంబులమీద విస్ఫుట మహా
ఘంటారవం బొప్పగాఁ
బురమంతెల్లెడ మక్కుమారు జయమున్
ముమ్మారు జాటింపు డా

దర మొప్పారఁగఁ బుణ్యకాంతలును
విద్వ ద్భూసుర వ్రాతమున్
ద్వరగానేగి యెదుర్కొనంగవలయున్
దద్వీర చూడామణిన్.

ఉత్తరయు. నుత్తమకన్యకా జనములు వెంటరా, సుర భిళ గంధమాల్యాంబరములఁ గైకొని భూమింజయున కెదురేగుగాక! మంగళ తూర్యారావములు మిన్నుముట్టి మారోగుచుండ, మంత్రి సామంత దండనాథులు, అరివీర భయంకరుఁడగు నుత్తరుని సాదరముగ నాహ్వానించి, యిటకు రావింతురుగాక!

అమా: చిత్తము ప్రభూ! (నిష్క్రమించును)

విర: (కంకునివంకఁ జూచి) ఏమిభట్టారకా! నెత్తమొక పలుక యాడుదమా.

కంకు: మీరిప్పుడు మహానంద సాగరమున మునిగితేలు చున్నారు. మీతో నెత్తమాడి జయింపరాదు.

విర: (నవ్వుచు) ఇప్పుడన్ని విధముల జయము మాదే యందురా, ఇది సుహృద్ద్యూతము. జయమెవ్వరిదైనను నష్టములేదు. రండు, (దగ్గరనున్న సైరంధ్రిని జూచి) సైరంధ్రీ! సారెలు దెమ్మ.

(సైరంధ్రి సారెలు తెచ్చును. విరాటుఁడు పలుక ముందరికి లాగికొనును. ఇరువురును జూదమాడు చుందురు)

కంకు: జూదడుమాడుట శ్రేయస్కరముకాదు. మున్ను ధర్మ జుఁడు జూదమాడియే తనరాజ్య సర్వస్వమును, తుదకు తమ్ములను, ఆలినిగూడ పణముగా నొడ్డి యోడి పోయెను. దీనికెంత దూరముగనున్న అంతమంచిది.

విర; ఇక్కడ శకుని లేడులెండు.

కంకు; (సాభిప్రాయముగ) మరి ధర్మజుఁడో.

విర: ఆ మహనీయుఁ డున్నను ప్రమాదము లేదు. (ఇర్వు రును నవ్వుదురు) ఇంతటి ఘనవిజయము నెవ్వరైన నేకాలముసైన సాధించిరా? భూమింజయుని బాహాబల శౌర్యము లనుపమానములు. అద్భుతావహములు.

కంకు: నిజముగా యువరాజే కురుబలమును జయించినచో, అంతకంటె ఆశ్చర్యమగు విషయ మేముండును? ప్రపంచమందలి మహావీరులలో అతఁడే ఉత్తమోత్త ముఁడనవచ్చును.

విర: (చిరుకోపముతో) మీ మాటలు నా కర్థమగుటలేదు.

కంకు; ఇందర్థముగాని దేముండును. యువరాజే కురుబలమ లనే జయింపగలిగినచో అతనికి మించిన వీరు

భూమండలమున నుండఁ జాలఁడు అనియే నామాటల కర్థము.

విర : (కోపము నడచుకొనుచు) అర్థము తెలియుచునే యున్నది. దాని అంతరార్థమే తెలియుటలేదు.

కంకు : అదిగూడ స్పష్టమే కదా !

విర : (కోపము నడచుకొనుచు) మాకు స్పష్టముగ లేదు. మీరే ఆ నిగూఢాభిప్రాయమును వివరింపుఁడు.

కంకు : (నిశ్చలముగ) ఉత్తరకుమారుఁడీ విజయమును సాధింపలేదనియు. సాధింపలేఁడనియు నా నిశ్చితాభిప్రాయము.

విర : (కోపముతో) ఈ విజయవార్త అసత్యమందురా ?

కంకు : వార్త సత్యమే. విజయము నుత్తరుఁడు సాధించెను అనుమాట మాత్రము నిస్సందేహముగ అసత్యము.

విర : మరి యీ విజయము నెవ్వరు సాధించిరని బ్రాహ్మణోత్తముల యభిప్రాయము.

కంకు : (నిశ్చలము) ఈ విజయమునకు కారకుఁడు బృహన్నల. ఇది పరమసత్యము.

విర : (క్రోధఘూర్ణిత నయనుఁడై) మూర్ఖా ! ఈ విశృంఖల వాచాలత కిదియే ఫలము. (సారె గొని వ్రేయును. కంకుభట్టు నొసలినుండి రక్తము చిమ్మును)

సైరంధ్రి : (సంభ్రమముతో) అయ్యో ! రక్తము కారుచున్నదే. (త్వరితగతిని కంకుభట్టారకుని సమీపించి చీర చెరగుతో రక్తమును తుడుచును.)

విర : ఈతని రక్తమును నీవేల పైచీరతో నొత్తుచుంటివి.

సైరంధ్రి : వీరు మహానుభావులు.

విమల వంశవృత్తంబుల వెలయు వీరి
రక్తబిందువు లెన్ని ధారుణిని బడునొ
అన్నివర్షమ్ము లీదేశమందు నధిప !
భయదమైన యనావృష్టి భయము కలుగు.

కష్టదశలో మీరు నాకాశ్రయ మిచ్చిరి. మీ మేలు గోరుట నా కర్తవ్యము. కావున ఈ మహనీయుల రక్తబిందువులు నేలఁబడకుండ నా చీర చెరగున నొత్తుచుంటిని.

విర : (వినియు విననట్లు) విజయలక్ష్మీసనాథుఁడగు భూమింజయుని జూడ మా మనసు పరవశ్ల త్రొక్కుచున్నది. (తెరలో మంగళతూర్య నినాదములు వినవచ్చును. ప్రతిహారి ప్రవేశించును)

ప్ర.హా : జయము జయము మహారాజా ! యువరాజులు, బృహన్నలా సహితముగ వచ్చి, దేవరవారి అనుజ్ఞకై వేచియున్నారు.

విర ; త్వరగా ఆ రథిక సారథులను ప్రవేశపెట్టుము.

ప్ర. హా : చిత్తము దేవరా !

(ప్రతిహారి పోవుచుండగా కంకుభట్టాతనితో మెల్లగా) బృహన్నలకు నాయెడ భక్తి చాలగలదు. ఆతఁడీనెత్తురుచూచిన కోపించును. కొలదిసేపాతఁడు లోనికి రాకుండ నాపుము.

ప్ర. హా : చిత్తము (నిష్క్రమించును)

(ప్రతిహారి త్రోవ చూపుచుండగా ఉత్తరుఁడు ప్రవేశించి, తండ్రికడకేగి ఆతనిపాదములకు నమస్కరించును. ఆనంద బాష్పములు కన్నుల జాలువారుచుండగా విరటుఁడు ప్రియపుత్రుని లేవనెత్తి బిగియార కౌఁగలించుకొనును.)

విర : (ఉత్తరుని మోము చూచును) ఎంత ఆనందకరమగు విషయము. అత్యాశ్చర్యకరము గూడ. విజయశ్రీ సనాథుఁడవైన నిన్ను చూచుటచే మా జన్మ చరితార్థమైనది అమాత్య శేఖరా ! చిరంజీవిని చూడుడు. ఆ ముఖమున విజయకళ లెట్లుట్టిపడుచున్నవో ! ఆహవ రంగమున విశృంఖల వీరవిహారము గావించి, యరిబలముల నశ్రమమున జయించి, యక్షతగాత్రుఁడై తిరిగివచ్చినాఁడు.

అమా : యువరాజు పరాక్రమము జగద్విదితము మహారాజా ! చిరంజీవి సంగరసవ్యసాచి.

విర : (మీసము మెలివేయుచు) మాకీ విజయము గర్వ కారణమే. మనము సాధించిన విజయములో విశేష మేమున్నది. ఒంటరిగా, జగద్భయంకరమగు కురు సేన నెదుర్కొన నెవ్వఁడు సాహసింపఁ గలఁడు. సాహసించి యెదుర్కొన్నను విజయ మెవ్వఁడు సాధింపఁ గలఁడు ?

అమా : ఎవ్వఁడు సాధింపఁ గలఁడు ? కురుబలము నోర్చుట యన్న మాటలతో బనియా?

విర : కురువీరుల తలఁచికొన్నంతనే ఒడలు కంపించును. అట్టి మహావీరుల నెదుర్కొంటివి? ఎట్లు జయించితివి? కురువీరులు సామాన్యులా ?

ఒకఁడు పరశురామునోర్చిన శూరుండు
గురుఁ డొకండు వీరకోటికెల్ల
శర్వువరము వలన జనియించి యొక్కండు
మారులేని యస్త్రమహిమ నొప్పు.
సహజకవచాభిరాము డజయ్య విక్ర
మాన్వితుం డంగరాజు మహారథుండు;
మానితోజ్జ్వల శస్త్రాస్త్ర మహితులైన
ధార్తరాష్ట్రులు పరిపంథి దళన చణులు.

ఆమహావీరులు దేవాసురులనుగూడ లెక్కసేయరు. వారీపరాభవమునెట్లు సహించిరి? దుర్వారగర్వ దర్పా

ద్ధతుఁడగు దుర్యోధనుఁడీ యవమానము నెట్లోర్చెను ? ఈ మహాసంగ్రామమును గూర్చి తలఁచిన కొలఁదియు వెరగగుచున్నది. సమరప్రకారమును సవిస్తరముగాఁ జెప్పి మా సంశయము నివారింపుము నాయనా ?

ఉ.కు : చెప్పుటకేమున్నది. నేను యుద్ధమే చేయలేదు.

విర : ఆఁ ! యుద్ధమే చేయలేదా ? మరి !

అమా : మరి యీ విజయమునకుఁ గారకులెవరు ?

విర : లేక యీ విజయవార్త (అర్ధోక్తి)

ఉ. కు : విజయవార్త యసత్యముకాదు. నేనేకదా ఆ వార్త పంపినది.

విర : అంతయు అయోమయముగ నున్నదే.

ఉ. కు : అయోమయము, అగమ్యగోచరము నిందేమియులేదు. కురుసేన మహా పారావారమువలె నున్నది. దానిని చూచినంతనే నాకరచరణము లాడలేదు. నేను సమర పరాఙ్ముఖుఁడ నగుచుండగా, దివ్యాంశ సంభవుఁడగు మహావీరుఁ డొకఁడరుదెంచి నన్నాదుకొనెను. అతఁడే కురుబలముల నుక్కడగించి యఖండ విజయమును మనకు సంపాదించెను.

విర : ఎవరా మహనీయుఁడు తండ్రీ ! ఎక్కడ నుండును ? ఏమి చేయుచుండును ? అతఁడిచ్చటికేల రాలేదు ?

మన కింతటి మహోపకారము గావించిన, యావీర వరుని జూడ మా మనసు వేగిరపడుచున్నది. ఆతని నర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి, గారవించుట మన విధ్యుక్త ధర్మము.

ఉ. కు : అట్లే చేయవచ్చును. రేపో మాపో ఆతఁ డిచ్చటికే వచ్చును.

అమా : ఆ వీరచూడామణి రూపరేఖలెట్టివో. యుద్ధకౌశల మెట్టిదో కొంచెగనైనఁజెప్పి,మాకానందము గూర్పరా యువరాజా !

ఉ. కు : ఆతఁ డిట్టివాఁడని యెట్లు చెప్పనగును ? ఆతని బలపరాక్రమములు వర్ణనాతీతములు. ఆతఁ డగు నవ్యసాచియే.

విర : } (అచ్చెరువుతో) ఆఁ
అమా: }

ఉ. కు : ఆహవమున

విర : ఓహో.

ఉ.కు : ఆతఁడగు భీభత్సుఁడే యహితవీర
కంఠలుంఠన భీషణకర్మయందు.

(ఉత్తరుఁడిట్లు పలికి కంకుభట్టుకడకేగి భయభక్తులుట్టి పడ నమస్కరించును.)

కంకు : వంశపావనుఁడవై వర్ధిల్లుము నాయనా!

ఉ. కు ; (నుదుటిపై గంటుచూచి) ఇది యేమి ? రక్తము స్రవించుచున్నదే.

విర : నేను, నీ విజయము నభినందించుచుండగా నీతఁడు సహింపలేక పేడి పొగడఁజొచ్చెను. అంత సహింప లేక సారెఁగొని వ్రేసితిని.

ఉ. కు : ఎంత తప్పుపని, ఇమ్మహనీయుని మనము పూజింప వలెనేకాని యవమానింప నగునా, సవినయ ముగఁ బ్రార్థించి వారి యలుక దీర్పుఁడు. ఈ మహాత్ముఁ దలిగినచో మన సిరులేకాదు ఆయువుకూడ నశించును. (విరటుఁడు తన గద్దియ దిగివచ్చి కంకుభట్టును ప్రార్థించును.)

కంకు ; నాకుఁ గోపమెక్కడిది ? దీనికంతటికిఁ గారణము లేదిన వేళావిశేషమే,

విర : (సంతోషముతో)

ఎత్తుఁడు విజయపతాకము
నుత్తరునకుఁ బ్రమదమెనఁగ నుజ్జ్వల భంగిన్
గ్రొత్తగ సింగారింపుడు
పత్తనము నుదారవిజయ భాగ్యము దెలియన్.

ఉ. కు : ఔను, విజయపతాకము నెత్తుఁడు. అది నిజముగా విజయపతాకమే,

విర : బృహన్నల యిక్కడికి రాలేదా.

ఉ. కు ; వచ్చెనే, ఇప్పటికిప్పుడే యెందుఁ బోయెనో, మహా రాజా ! బృహన్నల నాకుఁ గావించిన సాహాయ్య

మింతింతయని చెప్పనలవికానిది.

విర : ఆతనిని అనర్ఘములగు కానుకలిచ్చి సత్కరింతము.

(బృహన్నల ప్రవేశించును)

విర : బృహన్నలా ! భూమింజయుఁ డిప్పుడె నిన్నుగూర్చి చెప్పుచున్నాఁడు. సారథ్యమున నీవు చూపిన శక్తి సామర్థ్యములు మాకెంతయు ముదము గూర్చినవి. నీకు కావలసినది కోరుకొనుము. కాదనక యిత్తుము.

భూ. కు : (తత్తరముతో) మహారాజా ! తొందరపడకుఁడు. బృహన్నలకు మన మిచ్చు పారితోషికము లక్కర లేదు.

విర : మరేమి కావలెను ?

భూ. కు : రేపు చెప్పెదనులెండు. ఇంతలో మించిపోవునది లేదు.

విర : సరే. (నవ్వుచు) ఇప్పుడు మీరిర్వురు నేకమైరి. మీ యిష్టమే మా యిష్టము.

భూ. కు : ఇప్పుడు మనమందరము నేకమైతి మన్నమాట.

విర : ఈ నాఁడంతట నానందమె వెల్లివిరియుచున్నది. అదిగో ! అప్పుడే మన కోటపై విజయపతాకము. నవనవోజ్జ్వల దీప్తితో నెగురుచున్నది.

భూ. కు : ఔను. సర్వధా అది విజయపతాకమే.

విర : విజయ పతాకావిష్కరణోత్సవమును దిలకింతము రండు

(అందరు నిష్క్రమింతురు )

—o—